# విభూతి

సారస్వత ధార్మిక మాసపత్రిక

Vibhuti

సంగిర చందా రు ౨-౮-౦



## విభూతి - విషయసూచిక

చిత్రభాను శ్రావణ భాద్రపదములు



పుండ్రము ౪
Vol. 4

శా. ౧౮౬౪ చిత్రభాను శ్రావణ, భాద్రపదములు
— సికింద్రాబాద్ —
25th August, & September 1942
SECUNDERABAD

రేఖ ౧, ౨
No. 1, 2

# యుద్ధపరిస్థితిలోగూడ

# మైసూరు ఇన్ష్యూరెన్సు కంపెనీ వారి

# ధార్మికసేవను

## ఈ క్రింది జాబే కొనియాడుచున్నది

శ్రీ మైసూరు ఇన్స్యూరెన్సు కంపెనీ లి. జనరల్ మేనేజరుగారి సన్నిధికి—

హైదాబాదు అత్రాఫ్‌బల్దా జిల్లా ఏదులాబాదు గ్రామనివాసిని పోతునకు భూలక్ష్మమ్మ జాజే పోతునకు రామన్నగారు వ్రాయించి యిచ్చిన విన్నప మేమనగా:—

తమ కంపెనీలో నా భర్తగారైన శ్రీ పోతునకు రామన్నగారు ౫౦౦౦ (అయిదు వేల) రూపాయీలకు భీమా చేసిన నెం. ౧౯౬౩ పాలసీ దారులై యుండిరి. వారు కొన్ని కిస్తులనుమాత్రమే చెల్లించి తర్వాత యుద్ధపరిస్థితులవలన భయమంది కిస్తులను మానివేసిరి. ఇట్లు జరిగిన ఒక సంవత్సరములో దైవవశాత్తు వారు అకాలమృత్యువువాత బడిరి. ఈ కారణముల వలనను నేటి యుద్ధపరిస్థితులవలనను కంపెనీ నుండి నాకు ఎట్టి పరిహారమును దొరకజాల దని భావించి యుంటిని, గాని కంపెనీ కానూనురీత్యా పాలసీ "ఆటోమ్యాటిక్ ప్రొటెక్షన్"కు లోబడియుండుటవలన తక్షణమే ఒక వత్సరపు ప్రీమియం రు ౩౨౪-౮-౦ లు పోను మిగిలిన ౪౬౭౫-౮-౦ రూపాయిాలను చాలా శీఘ్రముగా మా గ్రామమునకు కంపెనీవారే వచ్చి

శ్రీ రాజా బహద్దర్ వేంకట రామారెడ్డి, ఓ. బి. ఈ. గారి

అగ్రాసనాధిపత్యమున ఒక సభ నేర్పరచి మాకు అర్పించినది మిక్కిలి శ్లాఘనీయముగా నున్నది. ఇది కంపెనీవారు మొదటినుండియు అనుసరించిన పద్ధతి యని వినియున్నాను. యుద్ధ సమయమున మాకు ధనము వచ్చునో రాదో అను సందేహము దూరమగుటయే కాక, ఈ కాలమందు భీమాచేయుటయే సంపూర్ణముగా సహాయకారి యని మనస్సుకు దృఢమైనది. కావుననే మరల నా పుత్రుడైన పో. మంకన్న పేరుతో భీమా చేయింప దలచినాను. బీదలకు అనాధులకు ఆశ్రయదాత్రియై యీ "మైసూరు ఇన్స్యూరెన్సు కంపెనీ" మా నిజాము రాష్ట్రమునను, భారత వర్షమునను సర్వజనుల మన్ననలను సంపాదించి చిరస్థాయియై వెలుంగుగాక యని కోరుచున్నాను.

ఏదులాబాదు,
6—9—1942.

శ్రీమతి భూలక్ష్మమ్మ గారి
(యెడమవ్రేలి గురుతు)

**మీ కుటుంబ భవిష్య రక్షణకు నేడే భీమా చేయుడు**

వివరములకు ఈ క్రింది వారికి వ్రాయుడు :

జనరల్ మేనేజరు :—

# ది మైసూరు ఇన్ష్యూరెన్సు కంపెనీ లిమిటెడ్

| సబ్ ఆఫీసు : | హెడ్డాఫీసు : | బ్రిటిషిండియా హెడ్ ఆఫీసు: |
|---|---|---|
| కింగ్సువే, సికింద్రాబాదు. | బెంగుళూరు. | జాలి చౌక్, హుబ్లి. |

# ఓం విభూతి

సారస్వత ధార్మిక మాసపత్రిక

| పుంద్రము ౪<br>Vol. 4 | శా ౧౮౬౪ చిత్రభాను - శ్రావణ భాద్రపదములు, - సికింద్రాబాదు<br>25th August & September 1942, Secunderabad | రేఖ ౧, ౨<br>No 1, 2 |
|---|---|---|


## అనుభూతి

శ్రీమదక్షయ్యమైన విభూతికి నిర్మలనిదానమైన పరమేశ్వరుని భవ్యదివ్యమహిమలు అమేయములు. వాని యనుగ్రహమును బడసిన పసిపాపలు సైత మొకప్పుడు ఘనకార్యముల నిర్వహించి ధన్యజీవు లగుచున్నారు. మహాయుగములు మహాకల్పములుగ అనంతాఖండమైన కాలగతిలో 'విభూతి'కి నిండిన మూడేడులు ఒకనిమిషమున సహస్రాంశమైనను కాదు. కాని అల్పజ్ఞమగు బుద్ధి, స్వల్పమగు ధనముమాత్రమే అండగా నుండిన ఆ ప్రథమసంచికా ప్రకటనము నాటి మాశక్తి మాకే విశ్వాసము గలిగింప దయ్యెను. అకస్మాత్తుగ ప్రపంచముపై బడిన మహాసంగ్రామపువిపత్తువలన గూడ పత్రిక యెప్పుడో విలయము నందవలసి యుండెను. శివుడు అట్టి దుర్ఘటనను సమీపముగ నున్నట్లు దోపజేయుటయె కాని ప్రాణములను మాత్రము పదిలపరచి యుంచెను. కావుననే మరల నాల్గవవత్సరమున ప్రవేశింప గలిగినది. దిన దిన ప్రవర్ధమానము లగుచున్న ఉపద్రవములు ఉండియే యున్నవి. ప్రాణపణముగనైనను 'విభూతి'ని వీడరాదను విశ్వేశ్వరుని విధానమును నిర్లక్ష్యముచేయుటకు మే మెవరము ? ఇట్టి విపరీతపరిస్థితి యందును జగత్సంచాలనము నిరాతంకముగ సాగుచునే యున్నదికదా! మానవుడు అనవసరముగ తన అణువైన అనుభూతిని గూర్చి భయపడ జనదు. సర్వమునకు కర్తయైన సర్వేశ్వరుడు శరణాగతులను సర్వదా సంరక్షించుటకు సర్వధా జాగరూకుడై యున్నాడు. మా ఆత్మీయులైన మహారాజ రాజపోషక సహాయకులు; పాఠకులు యథాపూర్వము ఆశ్రియదాతలై విజ్ఞానదాత్రియైన 'విభూతి'కిని, తమకును గల ఆత్మీయతను చిరస్థాయి గావింతురుగాక!

—సంపాదకుడు.

# పుష్పాంజలి

శ్రీ బండారు తమ్మయ్యగారు

ఉ. శ్రీమహిళావరాది సురసేవితమాచు నఖండ వైభవ
శ్రీమహిమోన్నతంబయి వశీకృతసర్వసమగ్రశక్తిను
శ్రీమయమై వెలింగెడు విశిష్టమహంబు విభూతిఁ బ్రోవుతన్
శ్రీమహితంబుగా వఱలఁజేయుచు సంతతసత్కృపారతిన్.

ఉ. కాలము మాఱిపోయినది కాటక మెల్లెడ రాజ్యమేలు నే
చాలున జీవయాత్రలను జల్పుటొ తోఁపకయున్న దన్నిటన్
జాలిన కాలకాలుని ప్రసన్నకృపామహిమంబె రక్షమై
గ్రాలఁగఁ జిత్రభానుగతి రాజిలుమమ్మ, విభూతి! భూతిమై.

చ. కడపితి మూఁడు వర్షములు కాంచితి మన్నన లోకమందు నె
క్కుడుగనె నీదు ప్రాయమునకున్ మఱిమించెడురీతి; నేఁటి యీ
యొడుదుడుకుల్ గనుంగొనుచు నుత్తల మొందక ధైర్యలక్ష్మినిన్
విడువక నిర్వహింపఁగదె స్వీకృతదీక్ష విభూతిపత్రికా!

చ. తలపఁగఁ దా నొకండు మఱి దైవము వేఱుతలంచు నార! జేఁ
జలుపఁగ నెంచు కార్యములు చాలఁగఁ దక్కఁయె యుండ నిక్కటుల్
నెలకొనె నిట్లు నేఁ డనుచు నెవ్వగ నందక యీశ్వరేచ్ఛమై
నెలమిని భార ముంచుచు వహింపుము యుద్యమ ముత్సవంబుతోన్.

ఉ. భక్తియె సర్వసాధనము భక్తియె యెల్లరరక్షకంబునై
శక్తిని గూర్చు నెంతటియసాధ్యపరిస్థితులైన నోర్వఁగా
భక్తిని బాయ కెన్నఁడును భక్తులు తాము ముదంబుమై యథా
శక్తి విభూతిసుస్థితికి సాయ మొనర్తురుగాక దీక్షతోన్.

---

# *గణేశమహిమ్నస్తుతి

శ్రీ అష్టావధాని వడ్డాది సీతారామాంజనేయ కవిగారు

ఉ. ఎవ్వనియందు విశ్వ ముదయించి, ప్రవర్ధిలి నాశమొందునో
యెవ్వనిరూప మిట్టిదని యెన్నఁగ శక్యముకాదో, వేల్పులం
దెవ్వని నాద్యుఁ డంచు వచియించునో వేదము, తేజ మెవ్వఁ, డే
నవ్విభు, శ్రీగణేశు, స్తవనార్హచరిత్రు నుతింతు నిత్తఱిన్.

సీ. గాణేశు లెల్లరు గణనాయకుం డంచు, వైష్ణవోత్తము లెల్ల విష్ణుఁ డంచు
శైవపండితులు సంభావించి శివుఁ డంచు, సౌరమతస్థులు సవిత యంచు
శాక్తేయు లెల్లరు సంసర్గహేతువై, చెలఁగుచుండెడు పరశివుడటంచు
నొక్కగణేశునే నొక్కిచెప్పుచునుందు, రీదేవతలలోన నెవని నేను
గీ. ధృతిని భజియించుచుండుటో తెలియఁజాల, కున్నవాఁడను వాస్తవం బెన్నిచూడ
నఖిలమునకుఁ బరబ్రహ్మ మతఁడె కాఁడె? యట్టి గణపతి తేజ మే నాశ్రయింతు.

సీ. ఈశ్వరుఁ డని భజియించుచు నుందురు, యోగశాస్త్రజ్ఞానయుక్తు లెల్ల
నఖిలకర్మాకారుఁ డని యుపాసింతురు, పరఁగ మీమాంసకప్రవరు లెల్ల
నంతయు బ్రహ్మమయమ్ముగా మదిని భావింతురు వేదాంత వేత్తలెల్ల
సకలగుణాకృతిఁ బ్రకటమౌ ప్రకృతిగా, స్మరియించుచుందురు సాంఖ్యులెల్ల
గీ. న్యాయవిదులు ప్రకర్తయే యందురెపుడు, బుద్ధిమూర్తిగ గణియించు బౌద్ధగణము
శ్రీగణేశునిమహిమ లశేషమెన్నఁ, జిత్రచిత్రమ్ముగాఁ బ్రకాశించుచుండు.

మ. ఇది బాహ్యం బగు చర్చయౌఁ బరతరుం డేలా గెఱుంగంబడున్?
మది నెవ్వాఁ డెటు లెంచు నట్లలరుఁ బున్నాగాస్యుఁ డేతత్కృతుల్
పొదలున్ బెద్దగఁ; దా నణుప్రతిముఁడై పొల్చున్; మహాత్తో నిర్గ
సదసద్రూపుఁడు, నాదబిందునుకళానంతాభుఁడౌ నెంతయున్.

సీ. పెక్కుమోములతోడఁ బిక్కటిల్లెడువాఁడు, గణనకు మీఱెడు కనులవాఁడు
అపరిమితంబైన హస్తముల్ కలవాఁడు, అమితమైనట్టి పాదములవాఁడు

* శివమహిమ్నస్తవమును విరచించి సుప్రసిద్ధుడైన పుష్పదంతాచార్యుడే ఈ గణేశమహిమ్నస్తుతిని రచించె నని కొంద రనుచున్నారు. కాని మూలసంస్కృతస్తవమును మే మింకను పరీక్షింపలేదు. కావున నది పుష్పదంతకృతమని నిర్ణయింపజాలకున్నాము. శ్రీ కవిగారు వినాయకచతుర్థి సమయమున బంపినారు కావునను వీరి యాంధ్రీకరణము 'విభూతి' పాఠకులకు ఉపయుక్త మగునని యిందు ప్రకటింపబడినది.

—సంపాదకుడు.

నిఖిలరూపములు తా నేయై చెలఁగువాఁడు, విపుల వచశ్శ్రీల వెలయువాఁడు
సకలగుణక్రియాసమయసంభృతశక్తి, నమరు ననంతనామములవాఁడు
గీ. సర్వవిషయములందు ససంఖ్యమును స, నంతమును నైన సదభీప్సితార్థములను
శరణు సొచ్చినవారికిఁ గరుణతోడ, ద్విపముఖుండు సదా ప్రసాదించుచుండు.

గీ. ఆదిమధ్యాంతములు లేక యాకసమ్ము, నట్లు వేఱయ్యు భక్తుల యాత్మవెలయు
వానిఁ బ్రియకరు సురగణమాననీయు, మహితుని గణాధినాథు నమస్కరింతు.

చ. అనలవధూటిపల్లవము; నాద్యము, నేకము నైనయక్షరం
బొనరును బీజమై ప్రణవయుక్తిని బిందుయుతాంగ సంగతిఁ
దనరు; నిచృత్తు ఛందమగుఁ; దన్మనియాగణకుండు; బీజముల్
మును మొనయన్ గణేశమనువున్ జపియింప శుభంబు పైకొనున్.

చ. ప్రకట గకారవాచ్యుఁడగు బ్రహ్మము రెండువిధాల నొప్పెడున్
బ్రకృతిగఁ బూరుషుండుగ ధరన్ సగుణుం, డగుణుండునై; తదా
జ్ఞకలిమి సృష్టియున్, స్థితియు, సంహృతియున్ జరుగున్, గణంబు, నా
యకుఁడును, గాలశాసకుఁడు నాతఁడె; తత్ప్రమథేశు నెన్నెదన్.

చ. కుతుకకు మీది భాగ మది కుంభిముఖోపమమై గకారమా
గుతుకకుఁ గ్రింది భాగము తగున్ జఠరాభ మదే ణకారమా
నితరవిభాగ మిశత యదే కటియున్, బదముల్; గణేశనం
చితతను నామధేయములు చెల్వగు నిట్లు త్రిలోకతుల్యమై

చ. నరుఁడు గణేశ యన్న వరనామము, త్ర్యక్షరభాసురమ్ము బి
గ్గర నొకమాఱు పల్కిన సుఖమ్ము లసంఖ్యముగాఁగ నొందుఁ, ద
త్పరమపవిత్రనామము జపమ్మొ యొనర్చిన యేని భాగ్య మ
క్షరము గదా! గణేశపదసంగతదివ్యమహత్త్వ మెట్టిదో!

చ. ఎవఁడు గణేశసన్నిధికి నేఁగి తదాననమందె దృష్టి ని
ల్పి, వరగణేశనామమును వేమఱు పల్కునొ వాఁడు తద్జ్ఞుఁడై
భువి నఖిలప్రభావ పరిపూర్ణత దీపిలుచుండు సుప్తమా
నవుఁడు ప్రబోధమున్ గనిన నల్వు వహించుచుఁ దత్స్వరూపుఁడై.

శా. తా నీ విశ్వము నంత నిండెఁ, దనలోఁ దళ్కొందు నీ విశ్వమున్
దా నెందుండునొ యందె బుద్ధి, ధృతియున్, లక్ష్మి మహైశ్వర్యముల్
జా నొందున్; దన నామసంస్మరణమే సంధించు భద్రమ్ము; దే
వానేకస్థిత దృక్సమం బిల గణేశాస్యైకసంవీక్షయే.

సీ. ఘోరాటవులలోనఁ గ్రుమ్మరు సమయాన, విద్య నేర్వఁగ మొదల్ వెట్టునెడల
యుద్ధమ్ము సేయ సంసిద్ధుఁడయ్యెడు వేళ, నరిభీతి పైకొన్న యవసరమున
నెచ్చోటికేనిఁ దా విచ్చేయుపట్టున, నూత్న పరివేశ ప్రయత్నమందుఁ
బ్రాణముల్ తనువును వదలిపోయెడు తఱి, నిట్టులే బహుబాధ లెనయునపుడు

గీ. మనమునందు గణేశ పావనపదమ్ము, సంస్మరించిన వానికి క్షణములోన
గాలిసోఁకున మబ్బులు తూలునట్టు, లాపదలు తూలు, నానంద మేపుఁ జెందు.

గీ. అజ! వరానీశ ధుండి సామజముఖ! శివ,సుత! మయూరేశ హేరంబ శుభనిధి గణ
నాథ! వరద! జ్యేష్ఠ కపిల నగజతనయ!,యపర! చింతామణి! దయామయాత్మ యనుచు,
శ్రీ గణేశునిఁ బిలువ హర్షించుచుండు.

గీ. కవియు, మూర్తిత్రయంబును,రవియు,శశియుఁ,బంచభూతమ్ము,లద్రులు,వననిధులును
గ్రహములున్, దారకలును, దిక్పతులు నెల్ల, రూపములును గణేశునిరూపె తలఁప.

చ. అనలము నెమ్మొగమ్ము, హరి యంఘ్రులు, పంకజసూతి వీక్ష్యకం
బినుఁడు కనుల్, కరంబులు సురేశుఁడు, శామము మారుఁ, డిందుఁడున్
మనము, కటిప్రదేశము క్షమాస్థలియున్, ఋతుషట్క మంగ మి
ట్లొనర గణేశుఁ డొప్పు మహితోదరదంతవిలాసభాసియై.

మ. మతి వీచోపు లిడంగ సవ్యసరణిన్, మందస్మితాస్యంబుతో
డుత వామస్థితి సిద్ధియొప్ప, నడుమన్ ధుండీశుఁ డింపొందు నం
చితపీఠంబున బాలభానురుచితోఁ జెంగావిపుట్టమ్ము ను
న్నతిమైఁ గట్టి, యనర్ఘ్యభూషలు మెయిన్, బాణిద్వయిన్ మించఁగన్.

చ. మునివర సిద్ధ రాక్షససమూహము ముందఱ నిల్చి మ్రొక్కుచున్
బ్రణుతి యొనర్చుచుండ, నజవాసవముఖ్యులు, భక్తకోటి యొ
య్యనఁ దనుఁ గొల్చుచుండఁ బ్రమథావళిఁ గూడి గణేశ్వరుండు క్రీ
డ నలరుఁ దోడివారు వికటప్రియదాదులు మోదమందఁగన్.

మ. ధృతిఖడ్గాంజనపాదుకారసములే దీవ్యద్బలంబై దశా
యత దిక్ఖేలనలోలవృత్తిని వశిత్వాద్యష్టసిద్ధుల్ దరి
బ్రితతోపాయనపాణులై యనిమిషత్వస్ఫూర్తి దీపింప సం
తతమున్ శాంకరిఁ గొల్చుచుండు నెదఁ దద్దాక్షిణ్య మర్థించుచున్.

మ. లలి గంధర్వులతోడఁ గూడి గణికల్ రంభాదిచంద్రాననల్
విలసద్గానమొనర్చు దుంతిసభ నుద్వేల ప్రమోదమ్ము వ

ర్థిలు హంకార చటూక్తులెల్లఁ ద్రోలఁగఁగర్, శ్రీమద్బుధానీక తీ
ర్థుల సందర్శనభాగ్యలబ్ధి సమృతోక్తుల్ మించి వర్షింపవే?

చ. పురములు మూఁడుఁ గాల్చునెడఁ బూర్వసుపర్వుల నెల్లఁ గూల్చు న
త్తఱి బలినొంచుచో, సుజనధారణ, భూవహనోద్యమంబునన్
వరకృతి సిద్ధినొంద భువనత్రియి గెల్వ గణేశుఁ గొల్వరే?
హారధరజాసరోజనయనాబ్జభవానిలభుజఙ్నరాంగజుల్.

సీ. స్వానందభవనవిఖ్యాతిఁ జెన్నొందు ను, పారిసాదమందు దేవపతివోలె,
మహిమాధికుండు శ్రీమంతుండు నయ్యును, బేదలిండ్లను లేడిపిల్లవోలె,
శివుని విలాసాప్తి జెలువొందుచున్న కై,లాసాన ద్వారపాలకునిఁబోలె,
క్షితి సమస్తమును శాసించురాజుల దుర్గ,వర్గమ్ములో జక్రివర్తివోలెఁ,

గీ. పార్వతీదేవి మృదులాంకపాళియందు, బుజ్జగింపంగఁబడుచు నామోదభరిత
వదనపంకజుఁడై సదా వఱలుచుండు, బాలగణపతి, మంగళోద్భాసితకృతి.

ఉ. ఏనుఁగుమోము వేల్పొకఁడె యెంతయు సంతసమందెనేని మో
దానఁ ద్రిలోకమండలి బుధవ్రజ మొప్పినయట్టులే యగుర్;
దీనదయాళుఁడౌ నతని దివ్యకటాక్షమునొందఁ డెవ్వఁ డ
వ్వానిభవంబు సర్వమును వ్యర్థము, చీఁకటికోణ మా పయిర్.

ఉ. నిండుగ భక్తియొప్పునెడ నిల్చు గణేశునిఁ గొల్చుచుండి భూ
శుండి, గురుండు, ముద్గలుఁడు, శుకశ్రీకజాదికభక్తులెల్ల గు
చ్ఛండ జపార్చనా హవనసంస్తుతితత్పరు లౌచు భక్తర
క్షుండని చాటరొక్కొ? తదకుంఠమహత్త్వపటుత్వతత్త్వముల్.

గీ. ఛదలిఖిత మృద్ద్రుమద్ధాతుజాతదంభ, దంతిముఖమూర్తులను నడుదారిఁ జూచి
పాపియయ్యుఁబోగడి మ్రొక్కు-బాటసారి,యఘముఁ బాసి, కీర్తినిబొందు నద్భుతముగ.

గీ. కుశల శిల్పివినిర్మితకుంజరాస్య, దారుమయవిగ్రహము బహిర్ద్వారమందు
నెలకొలుపగేహములను మంగళములెసఁగు, హర్షమునఁ జూపఱుల్ నెఱిఁగందిచూడ.

గీ. భాద్రశుక్లచతుర్థినిఁ బగట రెండు,జాములకు బంకమన్నుతో సామజాస్య
జేసి యింటింటఁ బూజలు సేయుచుందు, రబ్రమునఁ జూపఱులు మహాహ్లాద మొంద.

క. ఎనలేదు గణేశ మహి,మ్నసుతికిఁ; బ్రతిపద్య ముత్తమంబొకటి పఠిం
చిన గణపతి యలరుఁ, దదేకనామ సంస్మృతి సమంబుగద నేఁటితోఁ,

మ. కరుణావార్ధివి, విశ్వదాత విభవక్త్రా! నీవు; నిన్నే మదిఁ
నిరతంబున్ భజియించు భృత్యుఁడఁజుమీ నే నో విభూ! యీ కృతిన్
బరికీర్తింపఁగఁబడ్డ నీదు విభవప్రాచుర్యమున్ నాకు స
త్వరమే యీ జననమ్మునందె ముద మొప్పన్ సంప్రసాదింపవే.

ఉ. పైనములన్ గణేశ్వరుని భవ్యమతిన్ బఠియింప హర్షమెం
తే నొనగూడుఁగాన స్మరియించుచుఁ దత్పద పద్మయుగ్మమున్
నే నొనరించెదన్ నతు లనేకముఁ; దన్మహనీయ సంస్తుతి
శ్రీ నిరవద్య సత్ఫలవిశేషము ముం దిడుకొంచు నిచ్చలున్.

క. ఎవఁడు గణేశ్వర మహిమ, స్తవముఁ జదివి వినుచు నతని శ్రీమలుదోఁగు ని
య్యావని సతీసుతవిద్యా, ద్రవిణగృహస్థితిఁ గనున్, బిదప ముక్తిఁ గొనున్.

గీ. ప్రథిత పుష్పదంతాచార్యరచితకృతుల, శివగణేశమహిమ్నసంస్తవము నెలమిఁ
దెనుఁగుఁ జేయించినట్టి నీ నెనరు నెద నుతింతు సూర్యనారాయణ తీర్థదేవ!

ఉ. శ్రీయుత పుష్పదంతకవిసింహుఁడు సంస్కృతమందు ధీర సం
ఖ్యేయముగా లిఖించిన గణేశమహేశ మహిమ్నసంస్తుతుల్
పాయని భక్తి నాంధ్రమున వ్రాసితి, నర్పణసేతు సూర్యనా
రాయణ తీర్థదేవ! భవదంఘ్రియుగమ్మున స్వీకరింపుమా.

---



# ఆంధ్ర వాఙ్మయముపై శైవమత ప్రాబల్యము

శ్రీబండారు తమ్మయ్యగారు

క॥ శివమహిమము గ్రహియించుచుఁ, దవిలిన శివభక్తి జనులు తరియించుటకై
శివకృతులను నెలకొలిపిన, శివకవిగణములకు శరణు చేసెద నెపుడున్.

ప్రతి దేశమందును మతము వాఙ్మయము పరస్పర సంబంధము గలిగి తదభివృద్ధి కయి యన్యోన్యాశ్రయము నంది యుండె ననుట నిర్వివాదము. "మతము" అనునది "మన జ్ఞానే" (to think) అను ధాతువు వలన నిష్పన్న మయినది. ప్రత్యక్షముగఁ గానఁ నగు ప్రకృతి మహిమములను బరిణామములను గాంచి యందుకుఁ గారణమగు మహాద్భుత శక్తి యొకటి యుండియుండునని తలంచి దాని తత్త్వము గ్రహించుట కయి యొనర్చు ప్రయత్నమే మతశబ్దమున విలీనమయి యున్నది. ఆశక్తి నుద్దేశించి యప్రయత్నముగ నావేశపూర్వకముగ మనుజుని మనమును జీల్చికొని వెలువడిన వాక్ప్రపంచమే తొలుదొలుత వాఙ్మయరూపమును దాల్చినది. భారత దేశమందలి నిగమాగమములు ఉపనిషత్తులు మొదలగు పురాతనవాఙ్మయ మిందుకు నిదర్శనము. శక్తి విశిష్టమగు పరమేశ్వర తత్త్వము వేదకాలమునుండియు రుద్ర శివాదినామములతో వ్యవహరింపబడి క్రమక్రమముగ సులభోచ్చారణసంయుత మగు శివశబ్దమునఁ బరినిష్ఠమయినట్లు కానవచ్చును. శివస్య ఇదం శైవమ్" అను నిష్పత్తివలన శైవశబ్ద మేర్పడి యీ భరత దేశమునఁ బరమేశ్వరతత్త్వ జిజ్ఞాసాపర మగు ప్రాచీనతమమతమునకు నామమయి వెలసినది. ఈ మతమునకు ముఖ్య ప్రమాణగ్రంథములు చతుర్వేదములు, కామికాద్యష్టావింశత్యాగమములు, ఉపనిషత్తులు పురాణములు నని చెప్పఁదగును. భారత దేశమందలి మతములలో నత్యంతప్రాచీనమగు నీ శైవమతము రానురా ననేకము లగు నవాంతర భేదము లందినట్లు కాననగును. సూక్ష్మాగమములో-

శ్లో. సామాన్యశైవం ప్రథమం మిశ్రశైవం తతః పరమ్
శుద్ధశైవం తతో జ్ఞేయం వీరశైవ మతఃపరమ్.

అని స్థూలదృష్టితోఁ జతుర్విధ శైవములును; కారణాగమములో మఱింత విస్తరముగ-

శ్లో. ఆదౌ సామాన్య శైవంతు పూర్వశైవం ద్వితీయకమ్
మిశ్రశైవం తృతీయంతు శుద్ధశైవం చతుర్థకమ్
పంచమం శ్రౌతశైవంతు షష్ఠం తన్మార్గశైవకం
సప్తమం వీరశైవం స్యా ద్వీరసామాన్య చాష్టకం

విశేషం వీరశైవం తు నవమం పరికీర్తితం
నిరాభారాఖ్యశైవం తు దశమం పరిచోదితం
క్రియాశైవం దశవిధం తత్తద్భేదమిహోచ్యతే.

అని దశవిధశైవములును బేర్కొనఁబడి వానిభేదములు వివరింపఁ బడినవి. వీనిలోఁ గూడ మఱికొన్ని యవాంతర భేదములున్నవి. లకులీశ పాశుపతము, కాలాముఖము అని వ్యవహరింపబడు శైవమత భేదములు పయిని జెప్పిన దశవిధశైవములలోఁ జతుర్థభాగమగు శుద్ధశైవమునకుఁ జేరునని నాయభిప్రాయము. ఈ శైవభేదము లన్నియుఁ గ్రమపరిణామమున నొకదాని నుండి యొకటి వెలువడెనని తలంచుట సరిగాదు. ఈ విభేదము లన్నియుఁ జాలఁ బ్రాచీన కాలమునుండియే కొలఁదిగనో గొప్పగనో యా యా యాచార్యులచే వేర్వేరు ప్రాంతములఁ బ్రతిష్ఠింపఁబడి ప్రచారమందియుండుననియు రాను రానందులోఁ గొన్ని తక్కిన శైవభేదముల ప్రాబల్యముచే క్షీణతనొంది వానిలో నంతర్లీనమయి యుండుననియుఁ దలంచుట సమంజసముగఁ గాన్పించును. తక్కిన శైవభేదములకు సంబంధించిన మతము లిప్పుడు మన దేశమునఁ గానరాకున్నను దశవిధశైవములలో నుత్తమముగ నాగమములలోఁ బరిగణింపఁ బడిన వీరశైవ మతమునకు సంబంధించిన ప్రధాన పీఠము లాయాగమములలో వానికి నిర్ణీతమైన స్థానములయందే యీ క్రిందఁ జెప్పిన ప్రకార మిప్పటికిని నిలిచియున్నవి. సుప్రబోధ స్వయంభువాగమములలో వర్ణించిన ప్రకారము వీరశైవ మతాచార్యు లయిదుగురు. వారు తొలుదొలుత శివుని సద్యోజాతాది పంచవదనముల నుండి యుద్భవించిరి. రేవణసిద్ధ (రేణుక) మరళసిద్ధ, ఏకోరామ, పండితారాధ్య, విశ్వారాధ్య అనునవి వీరి కలియుగ వ్యవహారనామములు. వీరిలో బ్రథమాచార్యుఁడు రేవణసిద్ధుఁడు. రేణుకుఁడు త్రిలింగ దేశమునఁ గొలనుపాకయందలి సోమేశ్వర లింగ గర్భమున నుద్భవించి మలయాచలప్రాంతమున రంభాపురి, మైసూరు రాష్ట్రమందలి బాళెహొన్నూరు నందుఁ బీఠము నెలకొలిపెను. మరళసిద్ధుఁడు వటక్షేత్రమున సిద్ధేశలింగ గర్భమున జనించి ఉజ్జిని క్షేత్రమునఁ (బళ్ళారి మండలములో నున్నది) బీఠమును బ్రతిష్ఠించెను. ఏకోరామాచార్యుఁడు దక్షారామమున రామనాథలింగ గర్భ సముద్భూతుడయి హిమవత్కేదారమునఁ దన పీఠమును స్థాపించెను. పండితారాధ్యుఁడు శ్రీశైలమున సుధాకుండ క్షేత్రమున మల్లికార్జున లింగమం దుద్భవించి యచటనే పీఠమును బాదుకొలిపెను. (అది రమారమి యొకశతాబ్దము క్రిందట శ్రీశైలమునుండి గుంటకలునకుఁ దరలింపఁ బడినది. భిక్షావృత్తిమఠ మని పిలువఁబడు మఠమదియె.) విశ్వారాధ్యుఁడు కాశీక్షేత్రమున విశ్వేశ్వరలింగ గర్భమున సంజనితుఁడయి యందే పీఠమును నిలిపెను. (ఇదియే జంగమవాడి మఠ మనుపేర వ్యవహరింపఁబడు చున్నది.) ఆంధ్రదేశమునకుఁ ద్రిలింగాభిధానము కలిగిన కారణము పలువురు పలువిధముల వివరించు చున్నారు. వీరశైవ ప్రథమాచార్యు డాంధ్రదేశమునఁ గొలనుపాకయం దుద్భ

వించుటచే వీరశైవుల ప్రథమ నివాసస్థల మా దేశమే యనియు వారి మతములో ఇష్టప్రాణభావలింగము లను త్రిలింగములఁ గూర్చిన విచారణము ప్రధానాంగ మగుటచే నందువలన గూడ నీ దేశమునకుఁ ద్రిలింగ వ్యవహారము కలిగి యుండుననియు శ్రీ సి. పి. బ్రౌను దొరగారు Carnatic Chronology అను గ్రంథమున వ్రాసియున్నారు. పాశుపతమతస్థాపకుఁ డగు లకులీశుఁడు లాటదేశమునఁ గారోహణ గ్రామమున (Karwan in Baroda State) జనించినట్లు కొన్ని ప్రాచీన శాసనములనుండియు బురాణాది గ్రంథములఁ బట్టియుఁ గాననగును. ఉపలబ్ధము లయిన కొన్ని శాసనములఁ బట్టి క్రీస్తుశకము 13 వ శతాబ్దికిఁ బూర్వ మాంధ్రకర్ణాటదేశములలో (ఇప్పుడట్టివి గానరాకున్నను) నచ్చటచ్చట లకులీశపాశుపతమునకు కాలాముఖమతమునకుఁ జెందిన మఠములు నెలకొనియున్నట్లు కాననగును. కావున నాంధ్రదేశమున శైవమత భేదములలో ముఖ్యములగు పాశుపత కాలాముఖ వీరశైవములు కొంతవఱకు వ్యాపించి బౌద్ధ జైనాది నాస్తికమత నిర్మూలనమునకుఁ దోడ్పడి యాస్తికమతోద్ధరణమునకు మిక్కిలి పాటుపడె నని యనేక ప్రమాణముల వలన నిర్ణయింప వచ్చును. ఈ శైవమతప్రాబల్య మాంధ్రవాఙ్మయ వికాసమున కెంతవఱ కుపకరించెనో యించుక విచారింతము.

ఆంధ్రభాషలో నింతవఱకు గ్రంథరూపమున దొరకిన వాఙ్మయములో నన్నయ భట్టారక విరచిత మగు నాంధ్రమహాభారతమే మొదటికృతి యని యిప్పటికిని బలువురు పండితుల యభిప్రాయమై యున్నది.

ఆంధ్రదేశ పరిపాలకులలో వేంగీ చాళుక్యులే యాంధ్రభాషాపోషణమునకు మొట్టమొదట నడుము గట్టిన వారనుట నిర్వివాదము.

క. మును మార్గ కవిత దేశం,బున వెలయఁగ దేశికవిత బుట్టించి తెలుం
గు నిలిపి రంధ్రవిషయమున జన నత్యాశ్రయుని దొట్టి చాళుక్య నృపుల్.

(తెనుంగును నిలిపి రంధ్రవిషయంబునఁ జనఁజాళుక్యరాజు
మొదలుగఁ బలువుర్ అని పాఠాంతరము)

అను నన్నెచోడుని కుమారసంభవపద్య మిందుకు నిదర్శనము. నన్నయభారతము క్రీస్తుశకము 1053 ప్రాంతమున రచింపఁబడినదని పరిశోధకుల యభిప్రాయము. అంతకుఁ బూర్వము రెండువందల సంవత్సరముల లోపల వెలువడిన గుణగ విజయాదిత్యుని (క్రీ॥ శ॥ 848-892) యద్దంకి శాసనము, చాళుక్య భీముని (క్రీ॥ శ॥ 892-918) ధర్మపురశాసనము, దీర్ఘాసిశాసనము, యుద్ధమల్లుని (క్రీ॥ శ॥ 927-934) బెజవాడ శాసనము మున్నగు వాని లోని రచనములు తిలకింప తరువోజ, సీసము, అక్కరవంటి దేశీయచ్ఛందములలోఁ బద్యరచనము మన దేశమునఁ గొంతవఱకు సాగుచుండినట్లు కానవచ్చినను విపుల శబ్దశాస

న్నుండయి భాషను దగురీతిని శాసించి యంతకు ముందు గీర్వాణ కర్ణాట భాషలలో నున్న కావ్యముల నవలోకించి వాని ననుసరించి దేశీయచ్ఛందములతో నేగాక యుత్పల, చంపక, మత్తేభ, శార్దూలాదివృత్తములతోఁ గూడ రచనము సాగించి వాఙ్మయమును గ్రంథరూప మున గ్రథించినవాఁడు నన్నయభట్టారకుఁడే యని యెన్నఁదగును. నన్నయకుఁ బూర్వము వృత్తరచనమున్నను లేకున్నను పాల్కురికి సోమనాథుని పండితారాధ్య చరిత్ర లో నుదాహృతములయిన తుమ్మెదపదములు, గొబ్బిపదములు, వెన్నెలపదములు, ఆనంద పదములు, పర్వతిపదములు, ప్రభాతపదముల వంటి దేశీయగేయవాఙ్మయము, ఆసోమ నాథుఁడు రచించిన పంచప్రకార గద్య, నమస్కారగద్యవంటి మాత్రాగణబద్ధము లగు సంస్కృత భూయిష్ఠ రచనములు నన్నయకుఁ బూర్వమే దేశమునఁ బ్రచారమున నుండి యుండు ననుట కనేకావకాశము లున్నవి. ఇట్టి రచనములకుఁ బోద్భల మొసంగి మూల కారణ మయినది ప్రజలయందలి మతాభినివేశమే యని వేఱ చెప్పనక్కఱలేదు.

చాళుక్య రాజుల శాసనములందలి యవతారికను దిలకించిన వారి పూర్వుఁడు విష్ణు వర్ధనుఁడు చలుక్యగిరియందు వెలసిన నంద యను పేరి గౌరీదేవి నారాధించి యామె యను గ్రహమున సామ్రాజ్య చిహ్నములఁ బడసినట్లును, పారంపర్యముగ వారు శివభక్తిపరు లయి పరమమాహేశ్వర, స్వామి మహాసేనపాదానుధ్యాతాది బిరుదముల ధరించుచుండి నట్లును గాననగును. "రాజానుమతో ధర్మ"యను ధర్మము ననుసరించి వారి యను చరులుఁ గూడఁ జాలవఱకు శైవమతాభినివిష్టు లయియుండిరి. గుణగవిజయాదిత్యుని ధర్మపురశాసనమున నాతని సేనాని బెజెయరాజునకుఁ బ్రియుక్తమయిన మహేశ్వర పక్షపాతి, దేవబ్రాహ్మణ గురుభక్తిపరుండు అను విశేషణము లిందుకు నిదర్శనము,

యుద్ధమల్లుని బెజవాడ శాసనములో నాతఁడు.

"వరగంగ బెజవాడం గొమరస్వామికి భక్తున్డై గుడియు
నిరుపమమతి నృపధాముడ్డెత్తిచ్చె నెగి దీర్చె మఠంబు"

అని కుమారస్వామి భక్తుఁడుగా నే వర్ణింపఁబడినాఁడు.

రాజరాజనరేంద్రుని తాత యిమ్మడి యమ్మరాజు విజయాదిత్యుఁడు క్రీ॥ శ॥ 958 ప్రాంతమున వెలయించిన తాండికొండ దానశాసనమునుబట్టి యాతఁడు లకులీశ పాశు పతమతస్థు లగు విద్యేశ్వరపండిత, మున్మడి ప్రభూతరాశి పండితులకు శిష్యుఁడయి వారికి గుంటూరు మండలమందలి తాండికొండను దాన మొసఁగి నట్లును గాననగును. నన్నయ భట్ట నారాయణభట్టారకాదికవుల నాదరించి యాంధ్రమహాభారతావతరణమునకుఁ గారణుఁ డయిన రాజరాజనరేంద్రుఁడుగూడఁ దన పూర్వులవలెనే శైవమతాభినివేశము గలిగియుండె ననుటకు భారతావతారిక యందలి యీ క్రింది పద్యములు నిదర్శనములు

చ. విమలమతిం బురాణములు వింటి ననేకము లర్థ ధర్మ శా
స్త్రముల తెఱంగెఱింగితి నుదాత్తరసాన్విత కావ్య నాటక
క్రమములు పెక్కు సూచితి జగత్పరిపూజ్యములైన యీశ్వరా
గమములయందు నిల్పితిఁ బ్రకాశముగా హృదయంబు భక్తితోన్.

మ. ఇవి యేనర్థి సతతంబు నాయెడఁ గరం బిష్టంబులై యుండు బా
యవు భూదేవ కులాభితర్పణ మహీయఃప్రీతియున్ భారత
శ్రవణాసక్తియుఁ బార్వతీశ్వర పదాబ్జ ధ్యాన పూజామహో
త్సవమున్ సంతతదానశీలతయు శశ్వత్సాధుసాంగత్యమున్.

వీనివలన రాజరాజు శివభక్తియు, శివాగమపరాయణతయు వ్యక్తము కాఁగలవు. మఱియు నన్నయ యాతనియెడ నాశ్వాసాద్యంతపద్యములందు వాడిన "మృడప్రియ (ఆ 1, ప 122) దక్షమఖారి దయాలబ్ధ సుస్థిరైశ్వర్యపదా (ఆ 7, ప 1) భీమేశ్వర కృతనిత్య ప్రసాద (ఆర, ఆ 1, ప 400) అను విశేషణములుగూడ దీనిని రూఢిపఱచును. "హరు వినుతుల బాసలాడఁ జేసినయట్టి ధట్టుని నన్నయభట్టుఁ బొగడి" అనెడి యమరేశ్వరుని విక్రమసేనమునందలి పద్యమునుబట్టి నన్నయభట్టారకుఁడుగూడ రాజరాజువలెనే శివభక్తి పరాయణుఁడని గోచరించును. రాజరాజనరేంద్రుని కాలమునాఁటికి వేంగీరాజ్యమున సామాన్యశైవ, పూర్వశైవ, మిశ్రశైవ, శుద్ధశైవములు కొంతకొంతవఱకు వ్యాపించి యున్నవి. పాశ్చాత్య చాళుక్యపరిపాలిత మగు కర్ణాటదేశమునను, దత్పరిసరమందలి యాంధ్రదేశమునను జైనమతమే యెక్కువ యాలంబనము గలిగియుండెను. పంచమవేద మగు భారతమునకు రాజరాజుకాలమునాటికిఁ గన్నడమున జైనకవులు పంపఁడు, రన్నఁడు రచించిన విక్రమార్జునవిజయము, గదాయుద్ధము నను అనువాదములు వెలసియున్నవి. వానిలో మొదటిది కృతిపతియగు అరికేసరిచక్రవర్తికి భారతవీరుఁడగు నర్జునునకు నించు మించుగ నభేదాధ్యవసాయ మొనర్చి, యర్జుననే కథానాయకునిగఁ గొని యాతని విక్రమో ద్ఘాటనమే ప్రధానలక్ష్యముగఁ గొని రచించినది. రెండవది భీమునకుఁ బ్రాధాన్య మొసంగి సంఘటించినది. పరిపూర్ణ భారతబద్ధస్వరూపము లగు వానికిజైనకృతు లుపకరింపఁజాలవయ్యెను. కావుననే జైనమత విమతత్వమును, శైవమతపరత్వమును గల రాజరాజునకు శివదీక్షా పరుఁడగు "జననుత కృష్ణద్వైపాయనమునివృషభుఁడు" అభిహితోక్తులు మెఱయఁ బచరించిన మహాభారత బద్ధనిరూపితార్థ మేర్పడఁ దెనుఁగున రచియింపఁ జేయుట పర మాభీష్టమయ్యెను. ఆంధ్రవాఙ్మయమునకు మూలకందమగు నాంధ్రమహాభారత మవత రించుటకు రాజశేఖరుఁ డగు రాజరాజునకు రాజశేఖరచరణారవిందముల యందుఁగల నిరుపమ భక్తియే కారణమగుట కొంతమాత్రము సందియములేదు. కాని, యీ మహాకార్య మా రాజచంద్రుని జీవితకాలములో సమాప్తినొందు భాగ్యము చేకూరదయ్యెను. మూఁడుపర్వములయిన ముగియక మునుపే నన్నయభట్టారకుఁడు స్వర్గస్థుడవుటవలననో

మఱి యే యితరకారణముననో గాని, యా మహాగ్రంథరచన మసంపూర్ణముగ నిలిచి పోయెను. రాజరాజుతరువాత రాజ్యమునకు వచ్చిన యాతని పుత్రుఁడు కులోత్తుంగ చోడ దేవుఁడు తండ్రివలెనే శివభక్తి పరాయణుఁడయి, యేఁబది వత్సరములదనుక రాజ్యపాలన మొనర్చెను. కాని, యాతఁడు జనకుని వేంగీరాజ్యమునేగాక, మాతామహుఁడగు రాజ రాజ చోడుని వలన సంక్రమించిన చోళరాజ్యమును గూడఁ బరిపాలించుచుఁ జాలవఱకుఁ చోళరాజధాని యగు కాంచీపురమునందే వసించుచుండెను. అందువలననేమి, రాజ్యమం దలి యలజడులచే నయిననేమి, యాతని కాలముననుఁగాని తరువాత కొంతకాలము వఱకు రాజ్యము నెఱపిన యాతని సంతతివారి కాలముననుఁగాని యాంధ్రమహాభారత రచనము పూర్తియగు నవకాశములు గలుగలేదు.

ఇంతలో నాంధ్రకర్ణాట దేశమునందలి శైవమతచరిత్రమున గొప్ప పరివర్తనము సంఘటిల్లెను.

సర్వేషా మపి శైవానాం । వీరశైవం మహోత్తమం
సులభైవతుపూజాచ సులభంచ క్రియావహం ।
అల్పక్రియం బహుఫలం వీరశైవం మహేశ్వరి!
ఏకేన జన్మనా ముక్తి ర్వీరాణాంతు మహేశ్వరి!
అన్యేషామపి శైవానాం ముక్తిర్జన్మత్రయేణచ"॥

ఇత్యాదిగఁ గారణాగమమున వర్ణింపఁబడిన వీరశైవము క్రీస్తుశకము పదిరెండవ శతాబ్ది నాఁటికి క్షీణదశను బ్రాప్తించుటచే దాని నుద్ధరించుటకు "ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే"అను న్యాయము ననుసరించి కొందఱు మహాపురుషు లవతరిం చుట యావశ్యకమయ్యెను. కావున నందికేశ్వరావతారమని తలంపఁబడు బసవేశ్వరుఁడు కర్ణాటదేశమునను, శివునిచే సంకల్పింపఁబడిన యొక ప్రమథమూర్తి యవతారముగ మల్లికార్జునపండితారాధ్యుఁడు, భృంగీశ్వరావతారమగు పాలకురికి సోమనాథుఁడు ఆంధ్రదేశమునను, శివుని యాజ్ఞానుసారము వీరశైవమత వ్యాప్తికి వేఱువేఱు ప్రాంతము లలో నుదయించిరి. బసవేశ్వరుఁడు శుద్ధకర్ణాటదేశమున జనించి, యచ్చటఁ గళ్యాణ పట్టణము రాజధానిగఁ బశ్చిమ చాళుక్య రాజ్యము పరిపాలించు బిజ్జలుని యొద్ద మంత్రిగా నుండి వీరశైవమతము నుద్ధరించి, కర్ణాటక దేశములో దానిని విస్తరింపఁ జేసెను. ఆతని యుద్బోధనములు, రచనములు, కన్నడ భాసయందే నెలకొనుటచే వాని ప్రాబల్యము కన్నడమునకువలె నాంధ్ర భాషావికాసమునకై యంతగా నుపకరింపవయ్యెను. మల్లికా ర్జున పండితారాధ్యుడు శుద్ధాంధ్రదేశమున గోదావరీ మండలమున దక్షారామక్షేత్రమున నుదయించినవాఁడు. బసవేశ్వరునకుఁ దోడుగ నాంధ్రదేశమున వీరశైవమతవ్యాప్తి నొనరించుటకై నందికేశుని సర్వజ్ఞత, భృంగి సహజనిష్ఠ, దూర్వాస ముఖ్యుల ధ్రువ

శావశక్తి, అక్షపాదాదుల యతులిత వాగ్విచక్షణత, ఉపమన్యుని సద్గురుత్వము మున్నగు మహత్తర శక్తియుక్తులు శివుని ప్రసాదమునఁ బడసి యవతరించిన వాఁడు. శివభక్తి వర్ధనార్థముగ నీతఁ డాంధ్రభాషలో వివిధరూపములుగ ననేకకృతులు రచించెను. అవి చాలవఱకుఁ గాలగర్భమున నడఁగినవి. వీనిలోఁ గందపద్యములోఁ గూర్పఁబడిన "శివతత్త్వసార" మను నుత్తమగ్రంథము మాత్రము కొంతవఱ కుపలబ్ధమై యాంధ్ర సాహిత్య పరిషత్తువారిచేఁ బ్రకటింపఁబడినది. ఇందు పశుపాశ పశుపతి జ్ఞానము, అద్వైత మతఖండనము, జగత్కర్తృత్వ విచారము, భవాదిశబ్దవివృతి, జగత్కర్తృలక్షణము, శివభక్తివివరణము, భక్తమహిమ మున్నగు విషయము లనేకములు సులభశైలిలోఁ గంద పద్యములలో వివరింపఁబడినవి. నన్నయభారతము తరువాత ననతికాలములో నొక శతాబ్దిలో నాంధ్రభాషలో వెలసిన గ్రంథములలో మిన్నగా దీని నెన్నవచ్చును. మఱియు నీ కృతిని బండితారాధ్యుఁడు స్వయముగనో, యటుతరువాత మఱియొక కవియో కన్నడమునఁగూడ ననువదించినట్లును దానిప్రతి గూడ నసమగ్రముగఁ బ్రాచ్యలిఖిత పుస్తకశాలలో నున్నట్లును, శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారి వలనఁ దెలియుచున్నది. అందలి యొండు రెండు పద్యములు చిత్తగించునది.

క. మానిసిపై తోల్గప్పిన, యీ నెవమున నున్నరుద్రు లీశ్వరభక్తుల్
మానిసులె వారు లోకహి,తానేకాచారు లీశ్వరాజ్ఞాధారుల్.

క. మానుషచర్మంపుదుగి, ర్దీనెవదింటప్ప రుద్రరీశ్వర భక్తర్
మానుష రెయివరులోకహి, తానేకాచర రీశ్వరాజ్ఞాధారర్.

క. స్ఫుటశివతాంత్రికుఁ డపగత, కుటిలాత్మకుఁడు దరియించు గోత్రమునెల్లం
బటుగతి "రజ్జుః కూపా, ద్ఘటంయథా" యనిన సూక్తి గారణమగుటన్.

క. స్ఫుటశివతాంత్రికనపగత, కుటిలాత్మక నుద్ధరింపను గోత్రమునెల్లం
పటుగతి రజ్జుః కూపాత్, ఘటం యథా యెంబ సూక్తి తథ్యమహాుదటెం.

ఆంధ్రభాషనుండి యిట్టు లన్యభాషలోనికిఁ బరివర్తింపఁబడు గౌరవము తొలుదొలుత నీ కావ్యమునకే గలిగినదని చెప్పవచ్చును. ఆరాధ్యదేవర మల్లికార్జున శతకములోనిదని యీ క్రింది పద్యము లక్షణగ్రంథములలో నుదాహృతమయినది.

ఉ॥ లోకములెల్ల నీతనువు లోనివ నీ వట యెంత కల్గుదో
నాకపపద్మసంభవజనార్దను.లాదిగ నెల్లపెద్దలున్
నీకొల దింత యంత యననేరక మ్రొక్కఁ దొడంగి రన్నని
న్నే కరణి న్నుతింతుఁ బరమేశ్వర శ్రీగిరిమల్లికార్జునా!

పాలకురికి సోమనాథుని పండితారాధ్య చరిత్రిలో.................
శతకంబు శివతత్త్వసారమాదిగను గద్య పద్యంబు
లాకాంతుఁ జదువుచును (వాద ప్రకరణము)
శతకంబు శివతత్త్వసారము దీప కళికమహానాటకము
నుదాహరణములు.........(పర్వత ప్రకరణము)

అని మల్లికార్జున పండితుని కృతులలో నుగ్గడింపఁబడిన శతకము ప్రాయశః ఈ మల్లికార్జున శతకమే కాఁదగును. ఆంధ్ర వాఙ్మయములో నాటక రచనము నాధునికులు ఇరువదవశతాబ్దిలోను, పందొమ్మిదవ శతాబ్ది యుత్తరార్ధమునను బ్రారంభించి పూర్వ లిందు విషయమై శ్రద్ధగొనినట్లు కానరాదని తలంచిరి. పదునాఱవ శతాబ్దిలో ఎలకూచి బాలసరస్వతి మాత్రము రంగకౌముది యను నాటక మొకటి రచించినట్లు లాతని గ్రంథ ములలో నుదాహృతమయినది. కాని పాలకురికి సోమనాథుని వ్రాఁతలఁబట్టి చూడ మల్లి కార్జున పండితుఁడో మఱొకరో దీపకళిక మహానాటకము మున్నగు రూపకములను పది రెండవ శతాబ్ది ప్రాంతముననే రచించియున్నట్లు కానవచ్చును. పండితారాధ్య చరిత్రమును బట్టి మల్లికార్జున పండితుఁడు రుద్రమహిమ,గణసహస్ర మాలిక,అమరేశ్వరాష్టకము, పర్వత వర్ణనము, లింగోద్భవదేవుగద్యము, పంచగద్యము మున్నగు గ్రంథములుగూడ రచించినట్లు కాన నగును. కాని యివి యింతదనుక మనకుఁ గొంతవఱకయిన దొరకలేదు. గద్య లనగాఁ గేవలము వచనరచనలు గావు. అవి మాత్రాగణబద్ధము లయిన గేయకృతులు. వాని స్వరూపము తెలియఁగోరువారు ఆంధ్రపత్రిక, ప్రజోత్పత్తి, ఆంగీరస, శ్రీముఖ భావ, యునసంవత్సరాది సంచికలలో నేను వరుసగఁ బ్రకటించిన పాలకురికి సోమనాథుని పంచ ప్రకారగద్య, నమస్కారగద్య, అక్షరాంకగద్య పద్యములు మున్నగు కృతులను వ్యాసము లను జిత్తగించునది. బసవేశ్వర పండితారాధ్యుల కించుక సమీపమున వెలసినవాఁడు పాలకురికి సోమనాథుఁడు. ఈతఁ డిప్పటి నిజాంరాష్ట్రాంధ్రదేశమున వరంగలు ప్రాంతమున నున్న పాలకురికియం దవతరించిన వాఁడు. బసవేశ్వరుఁడు, మల్లికార్జున పండితుఁడు, ఆంధ్ర కర్ణాట దేశముల నంత విఖ్యాతిని గాంచిన దీ కవివతంసుని యద్భుతకవితామహిమ మునసే యనుట సత్యదూరము గానేరదు. ఈ యిరువుర చరిత్రలను వివరించుట కీతఁడు బసవపురాణము, పండితారాధ్య చరిత్ర యను రెండుత్తమకావ్యముల నంత రించినాఁడు. ప్రమథాగ్రేసరుఁడగు భృంగియే కృతయుగమున సుకేశియను శివభక్తుఁడయి, త్రేతాయుగమున సానందుఁ డను మునినాథుఁడయి, ద్వాపరమున వ్యాకృతిసూత్రకారుఁడగు పాణినియై, కలియుగమునఁ బాలకురికి సోమనాథుఁడై యవతరించె నని శైవులలోఁ బారంపర్యముగ వ్యవహారమం దున్నది. "ప్రత్యక్షభృంగే శావతార" యనునది యాతని బిరుదములలో నొకటి. అప్రమేయము లగు నతని మతాభి నివేశము, భక్తిపారవశ్యము నాతనివలన వివిధరూపములగు కృతు లనేకములు వెలువడి

బహుముఖముగ నాంధ్రభాషావికాసమునకుఁ దోడ్పడుటకుఁ గారణములైనవి. ఆంధ్ర భాషలో నన్నయభట్టారకునితో నారంభమయిన యాంధ్రీకరణయుగారంభమందే యాతఁడా మార్గమును విడనాడి, మల్లికార్జున పండితునివలెనే స్వతంత్ర గ్రంథరచనమున కుపక్రమించెను. మఱియు మూడుపాళ్ళు సంస్కృతపదములతో సాగిన నన్నయరచనావిధానమునకు వన్నియ పెట్టనెంచి, తేనియసోనలం జిలుకు జాను తెనుంగునెడను జాతీయచ్ఛందములందును మక్కువగొని నిక్కమయిన దేశితెనుంగుఁగవితకుఁ బ్రాణము వోసి, యా తరువాత వెలసిన తిక్కనాదిమహాకవుల కవితానిర్మాణమునకయి మార్గమును దీర్చినవాఁడీ మహనీయుఁడు.

"ఉరుతర గద్యపద్యోక్తులకంటె, సరసమై పరఁగిన జాను తెనుంగు
చర్చింపగా సర్వసామాన్యమగుట, గూర్చెద ద్విపదలు కోర్కె దైవార.

(బసవపురాణము)

"అరూఢ గద్యపద్యాది ప్రబంధ, పూరిత సంస్కృత భూయిష్ఠరచన
మానుగా సర్వసామాన్యంబుగామి, జాను తెనుఁగు విశేషము ప్రసన్నతకు.

(పండితారాధ్యచరిత్రము)

అని జాను తెనుంగు పయిఁగల వలపును వెల్లడించి జనసామాన్యమునకు సుబోధమగుటకయి తెలుంగు తీయందనము జాలువాఱ నీతఁడు తనప్రధాన కృతులగు బసవపురాణ పండితారాధ్య చరిత్రలను జాతీయచ్ఛంద మగు ద్విపదలో రచించినాఁడు. ఈ ద్విపద కావ్యముల ప్రాశస్త్యమును ఆంధ్రభాషా వికాసమున కవి తోడ్పడిన విధమును వివరించుట కిచ్చట నవకాశము లేదు. కావ్యవ్యాకరణ తీర్థులు నా మిత్రులు పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రిగా రిందుఁగూర్చి వ్రాసిన యీ క్రింది వాక్యములఁ జిత్తగింపుడు.

"ఈ రెండు గ్రంథములు (బసవపురాణ పండితారాధ్య చరిత్రములు) నెక్కడ చూచిన నక్కడ నవరసములు పొంగి పొరలిపోవు నంతటి రసోదంచితములుగ ద్విపదలలోఁ గూర్పబడినవి. హిమవద్భూధర గుహాగ్రముల నుండి యనర్గళముగా దుమికి వచ్చెడు గంగాప్రవాహముంబోలె నీమహామహుని కవిత్వము పాఠకుల మనంబుల నానందపూరమున నోలలాడించుచుండును. భక్తశిరోమణి యగు పోతన్న భక్తిపారవశ్యపు కవిత్వమునకును కవిసార్వభౌముఁడగు శ్రీనాథమహాకవి నుడికారముల గడుసుదనంపు చిన్నెలకును కర్ణాటరాజ్యరమానాథుఁడు నాంధ్రభోజుఁడు నాంధ్రకవియు నగు కృష్ణదేవరాయ మహారాజుల యాముక్తమాల్యద మున్నగు కృతులలోని యద్భుతవర్ణనపటిష్ఠము లగు సందర్భములకును, దీనికి దానికి నననేల, ఇంతదనుక మన యాంధ్రసారస్వతమునఁ గల హృద్యములగు రసవద్వర్ణనోదంచితము లగు కావ్యపు మెఱుఁగుల కన్నిటికిని ఈ రెండు ద్విపద కావ్యములే మార్గదర్శకము లయి రాజిల్లినవి యనుటలో నేమియు సందియము లేదు.''

బసవేశ్వరునియం దీతనికిఁగల భక్తికి మేరలేదు. మల్లికార్జునపండితునెడ నీతనికిఁగల భక్తిగౌరవములుగూడ నట్టివే. అనితరసులభంబగు నిట్టి భక్తివిశేషమే యీతఁడు వారిని గూర్చి వ్రాసినకృతుల కట్టి విశిష్టతను ఘటింపఁగల్గినది. బసవేశ్వరునిగూర్చి యీతఁ డొక బసవపురాణమేగాక, బహుముఖములగు స్తోత్రములఁ రచించినాఁడు. కావుననే "సముదంచ ద్వృషభ స్త వామర మహీజారామసం సోమనఁ" అని కన్నడకవులుకూడ నీతని నుతించిరి.

> "బసవన్నమహిమ శుంభద్భక్తియుక్తిఁ, బచరించితివి గద్యపద్యాది కృతుల
> నర్ణవావృతధాత్రియందొప్ప బసవ, వర్ణనల్ చేసితి......"

అని యీ కాలపుభక్తులు తన్ను నుతించినట్టు లీతఁడు పండితారాధ్యచరిత్రమున వ్రాసికొనినాఁడు. ఉదాహరణయుగ్మము (తెనుగున నొకటి, సంస్కృతమున మఱియొకటి), వృషాధిపశతకము, చతుర్వేదసారము (బసవలింగ యను మకుటముగల సీసశతకము), పంచ ప్రకారగద్య, నమస్కారగద్య, అక్షరాంకగద్య, అక్షరాంక పద్యములు, అష్టకములు, బసవరగడ, బసవాష్టకరగడ, సద్గురురగడ మున్నగు కృతు లనేకములు బసవపురాణ రచనమునకు ముందును వెనుకనుగూడ రచించి, బసవేశ్వరుని కీర్తి సౌరభముల నీతఁడు దశ దిశలను వెదఁజల్లినాఁడు. ఈదృశంబగు గేయవాఙ్మయములో నాంధ్రభాషయం దీతని కృతు లద్వితీయము లని చెప్పఁదగును. మనభాషలో నుపలబ్ధము లయిన ఉదాహరణ గ్రంథములలో నీతని బసవోదాహరణమే మొట్టమొదటిది. ఆంధ్రభాషలో రానురాను విశేష విస్తృతినొందిన శతకవాఙ్మయమునకు వృత్తశతకములకు మల్లికార్జున పండితుని శ్రీ గిరి మల్లికార్జునశతకము, సోమనాథుని వృషాధిపశతకమును, కందపద్యశతకములకు పూర్వోక్త మగు శివతత్త్వసారము, సీసశతకములకు సోమనాథుని చతుర్వేదసారము (బసవలింగ శతకము) అను గ్రంథములే మార్గదర్శకములని నిరాఘాటముగఁ జెప్పనగును. సోమనాథుఁడు రచించిన పద్యకావ్యములలో నుపలబ్ధమయినది అనుభవసార మను లఘుకృతి. ఇందు రమా రమి మూఁడువందల పద్యము లున్నవి. నన్నయ తిక్కనల మధ్యకాలములో నాంధ్రపద్య రచన మొందిన క్రమపరిణామమును గుర్తింపఁదలంచువారి కీ కృతి మిక్కిలి యుపకరించును. రగడలు కన్నడ వాఙ్మయమున నేగాని ఆంధ్రవాఙ్మయమున నంతగా విస్తృతి నొందలేదు. ఆంధ్రభాషలోఁ బ్రబంధకవులు మాత్రమే వీనిని దమ ప్రబంధములలోఁ గ్వాచిత్కముగ రచించియున్నారు. ఆంధ్రపత్రిక యువసంవత్సరాది సంచికలో నేఁ బ్రకటించిన సోమనాథుని బసవరగడ యీ విషయమునఁగూడ మనకు దొరకిన మొదటి కృతియయి యున్నది. గద్య కృతులు, అక్షరాంకపద్యములు రానురాను మన వాఙ్మయమున సన్నగిల్లినవి.

ఇట్లు పదిరెండవశతాబ్దిలో జరగిన మహాపరివర్తనఫలితముగ నాంధ్రవాఙ్మయ మున నొక నూతనోత్తేజము గల్గినది. అప్పటి దేశపరిపాలకులగు కాకతీయ చక్రవర్తులు తత్పూర్వము జైనమతావలంబకు లయ్యు నామతమును వీడి, శైవమతమును స్వీకరించి,

తత్సంరక్షణమునకై విశేష పరిశ్రమ మొనర్చిరి. పైని బేర్కొనబడిన పాలకురికి సోమనాథుఁడు కాకతీయ రుద్రదేవుని కాలమందుండి యాతని యాశ్రయము నొందియుండెను. అప్పుడు జరగిన మతపరివర్తనములో శైవమతములోని సామాన్యాంతర్భాగములుగూడఁ జాలవఱకు వీరశైవములో విలీనమైపోయెను. ఇంచుమించుగ నీ కాలముననే తెలుఁగు చోడరాజును కాలాముఖశైవగురుఁ డగు జంగమ మల్లికార్జునయోగిశిష్యుఁడు నగు నన్నెచోడ కవిరాజశిఖామణి సోమనాథునివలెనే స్వతంత్ర గ్రంథరచనకుఁ గడంగి, యాతనివలెనే జాను తెనుంగుపై మక్కువగొని కుమారసంభవము, కళావిలాసము మున్నగు గ్రంథములు రచించెను. ఇతని కుమారసంభవము సంస్కృతకావ్యము దేనికిని సరియగు ననువాదముగాక, యించుమించుగఁ బ్రబంధశైలిలోఁ గూర్చిన స్వతంత్రగ్రంథము. ఇది యాంధ్రవాఙ్మయమున కమూల్యాలంకార మని పండితు లందఱును నేకగ్రీవముగ నంగీకరించుచున్నారు. ఆంధ్రవాఙ్మయమునకుఁ బ్రబంధవాసన గుబాళింపఁజేసినవి యెఱ్ఱాప్రెగడ నృసింహపురాణము, నాచనసోముని యుత్తరహరివంశ మని పలువురు తలంచుచున్నారు కాని, యంతకు రెండుశతాబ్దులు పూర్వమే రచింపఁబడిన నన్నెచోడుని కుమారసంభవమునకే యీ గౌరవము చేరఁదగుననుట సత్యసమ్మతమగుగ నుండును. రుద్రదేవుని తరువాత రాజ్య మేలిన కాకతీయచక్రవర్తి గణపతిదేవుని గురువుగా నుండిన గోళకీమఠాధ్యక్షుఁడు విశ్వేశ్వర శివదేశికుఁడు రచించిన పురుషార్థసారము, రెండవ ప్రతాపరుద్రుని కాలమున నొలని గణపతిదేవుఁడు రచించిన శివయోగసారము మున్నగు కృతులుగూడ స్వతంత్రగ్రంథములే. ఇవికూడ నాంధ్రవాఙ్మయమున నుత్తమస్థాన మలంకరించును. వీరశైవమత విజృంభణమువలన నిట్లు రమారమి రెండుశతాబ్దుల దనుక నప్పటికవులు, రాజులు స్వతంత్రము లగు మతగ్రంథరచనముదెసనే దృష్టిఁ బఱుపుటచే రాజరాజుకాలమున నారంభమైన యాంధ్రమహాభారతాంధ్రీకరణము గొనసాగించువా రెవ్వరికిని గలుగదయ్యెను. తరువాత క్రీస్తుశకము 1260 ప్రాంతమున నెల్లూరు మనుమసిద్ధిరాజునకు మంత్రి గానుండి, "మహేశ్వరాంఘ్రికమల ధ్యానైకశీలుఁడు" "చిత్తనిత్యస్థితశివుఁడు" నగు తిక్కనామాత్యుఁ డీ పనికిఁ గడంగి, నన్నెచోడసోమనాథు లేర్పఱచిన జాతీయ కవితానిర్మాణమార్గము ననుసరించి, యసదృశనైపుణితో మహాభారతమునందలి మిగిలిన పదునైదు పర్వములును జాను తెనుంగు తుఱంగలింపఁ దెలిఁగించెను. అటుతరువాత మఱియొక శతాబ్దిలో శివభక్తాగ్రేసరుఁడు శంభుదాసబిరుదాంకితుఁడు శంకరసంయమి శిష్యుఁడు నగు చదలువాడ యెఱ్ఱాప్రగడ నన్నయభట్టు విడిచిన యారణ్యపర్వశేషమును నన్నయమార్గముననే పూరించి, కృతార్థుఁడయ్యెను. ఎట్లైననేమి, ప్రారంభింపఁబడిన మూఁడుశతాబ్దులలోనైనను నాంధ్రమహాభారతము శైవమతాభినివిష్టు లగు కవిచక్రవర్తులచేతనే పూర్తిచేయఁబడుట ముదావహము.

రెండవ ప్రతాపరుద్రునికాలములో మహమ్మదీయుల దాడులవలనఁ గాకతీ

యాంధ్రసామ్రాజ్యము విధ్వస్తమై దేశము తురుష్కాక్రాంత మయ్యెను. కాకతీయుల సామంతులుగా నుండిన రాచకొండ వెలమవారు, ప్రోలయ వేమారెడ్డి మున్నగువారు మరల మహమ్మదీయుల నోడించి, దేశము నుద్ధరించి, ఆంధ్రసామ్రాజ్యమును గాకపోయినను, స్వతంత్రములగు చిన్నచిన్న రాజ్యములను స్థాపించిరి. ప్రోలయ వేమారెడ్డి స్థాపించిన రెడ్డిరాజ్యము నానాఁటికి విస్తరిల్లెను ఈతఁడు, నీతనిసంతతివారుకూడఁ దమయేలిక లగు కాకతీయులవలె శైవమతము నవలంబించి, శైవకవుల నాదరించి, యాంధ్రవాఙ్మయ వికాసమునకుఁ దోడ్పడిరి. శంభుదాసుఁ డగు ఎఱ్ఱాప్రెగడ ప్రోలయవేమారెడ్డి యొద్దనే యాస్థానకవిగా నుండి, పైని జెప్పిన యారణ్యపర్వశేషమేగాక, రామాయణము హరివంశము, నృసింహపురాణము మున్నగు గ్రంథములు రచించెను. శైవులు శివపారమ్యమును మాత్రమే యంగీకరించి విష్ణుపారమ్యమును గ్రహింపకపోయినను, విష్ణువును బరమశివభక్తాగ్రేసరునిగా నెంచి, ప్రమథులతోపాటాతనిని గూడఁ బూజింతురు. అందుచే వారికి విష్ణుద్వేషముగాని, విష్ణుపరములగు గ్రంథములయెడ విముఖత్వముగాని లేవు. అందుచేతనే సుప్రసిద్ధు లగు శైవకవులు పలువురు విష్ణుదేవతాపరము లగు గ్రంథములుగూడ రచించి సన్నుతిని గాంచిరి. పాలకురికి సోమనాథుని శిష్యుఁడని చెప్పఁబడు రంగనాథుఁడు రచించిన ద్విపదరామాయణము, తిక్కన నిర్వచనోత్తర రామాయణము, యెఱ్ఱాప్రెగడ రామాయణాదులు, నాచనసోముని యుత్తరహరివంశము, బమ్మెరపోతన భాగవతము మొదలగునవి యిందుకుఁ బ్రబలనిదర్శనములు. పోతనకుటుంబము తరతరములనుండి శైవమతాభినివిష్టమే యనియు, నాతఁడు స్వయముగ నారాధ్యబ్రాహ్మణుఁ డగు ఇవటూరి సోమనాథుని శిష్యుఁడనియు నాతని గ్రంథములవలనను, నాతని మనమలు మల్లన కేసనలు రచించిన దాక్షాయణీ పరిణయము వలనను వ్యక్తముగాఁగలదు. ఇఁక రెడ్డిరాజులకాలములోఁ గవిసార్వభౌముఁ డగు శ్రీనాథుఁడు ఈశ్వరార్చన కళాశీలుఁడై రెడ్డి రాజాస్థానుల నలంకరించి, పండితారాధ్యచరిత్రము (పాలకురికిసోముని ద్విపదను బట్టి కూర్చిన పద్యకావ్యము), శృంగారనైషధము, హరవిలాసము, భీమఖండము, కాశీఖండము, శివరాత్రి మాహాత్మ్యము మున్నగు గ్రంథములు రచించి, యాంధ్రసారస్వతమున కెనలేని రామణీయకము నాపాదించెను. ఈ శైవకవి వతంసుని గ్రంథములు పాలకురికి సోమనాథుని కృతులవలె శివభక్తి ప్రబోధకములేగాక, యాంధ్రభాషా వికాసమున కెంతయో యుపకరించిన వనుట నిర్వివాదమని యెల్లరు నంగీకరించినదే. ప్రబంధకవితల్లజుం డగు నల్లసాని పెద్దన కవిత శ్రీనాథుని యడుగుజాడలఁబట్టి నడచిన దనుట యెల్లరకుఁ దెల్లమే. ఈ కాలముననే నిశ్శంకుల కొమ్మనామాత్యుఁడు శివలీలావిలాసము, వీరమాహేశ్వరము మున్నగు గ్రంథములను, గౌరనామాత్యుఁడు నవనాథచరిత్రము, హరిశ్చంద్రోపాఖ్యానము మున్నగు ద్విపదకావ్యములను రచించి, యాంధ్రవాఙ్మయ విస్ఫూర్తివికాసముల కెంతయుఁ దోడ్పడిరి. తరువాత నొక శతాబ్దిలోఁ బాలకురికి సోముని శిష్యప్రశిష్యు లగు

పిడుపర్తి బసవన, యాతని కుమారుఁడు సోమనాథుఁడు మున్నగువారు కన్నడమునుండి దీక్షాబోధ, ప్రభులింగలీల మున్నగు వీరశైవమతగ్రంథములను ద్విపదకావ్యములుగ ననువదించి, శైవమత సేవను గావించిరి. ఆంధ్రమందలి వేదాంతగ్రంథములలోఁ బ్రభులింగలీలకున్న యున్నతస్థాన ముగ్గడింపఁ దగినది. కృష్ణదేవరాయల యాస్థానకవులలో మాదయ్యగారి మల్లన రాజశేఖర చరిత్రమను స్వతంత్ర సత్కథాపాదిత మగు మనోహర ప్రబంధమును, తెనాలిరామలింగము ఉద్భటారాధ్యచరిత్రమును, ధూర్జటి కాళహస్తి మాహాత్మ్యమును రచించి, మరల శైవమతోద్బోధమునకుఁ దన్మూలమున భాషావికాసమునకుఁ దోడ్పడిరి. మల్లన పదలాలిత్యము, ధూర్జటి మాధురీమహిమము జగత్సన్నుతములనుట వేఱ చెప్పనక్కఱలేదు.

తరువాతఁ దరువాత శైవమతమున కాంధ్రదేశమునఁ బ్రాబల్యము తగ్గిపోయెను. దానితో నుత్తమశైవ గ్రంథరచనముల కవకాశము క్రమక్రమముగ సన్నగిల్లెను. గతానుగతిక మగు ప్రబంధరచనమే యాంధ్రవాఙ్మయమున విస్తరిల్లెను. దానితో నాంధ్రభాషావధూటికి సహజవిలాస వికాసములు దూరము లయ్యెను. అది కాలమహిమ. "గతకాలము మేలు వచ్చుకాలముకంటెన్" అను పెద్దలనుడి సత్యసమ్మతముగదా!

మహాశయులారా! ఆంధ్రదేశమున శైవమతప్రచార మాంధ్రభాషావికాసమున కెంతవర కెట్లు తోడ్పడినది పైనివ్రాసిన సంగతులవలనఁ గొంతవఱకు విశదము కాఁగలను. వైష్ణవ గ్రంథరచనమునకుఁ గూడ నదియే ప్రోద్బల మొసంగిన తెఱంగుఁగూడ నొకింత వివరించియుంటినిగదా. కావున, శైవమత ప్రాబల్య మాంధ్రవాఙ్మయమున కొనర్చిన యుపకార మపారము, చిరస్మరణీయము. కర్ణాట వాఙ్మయమున కది యొనరించిన యుపకార మింతకన్న మిన్న యనుట చెప్పనక్కఱలేదు. ఆంధ్రభాషాభిమానులు శివకవులను, వారిగ్రంథములను నిరంతరము స్మరించి, సేవించి, శివానుగ్రహమును బడసి, చరితార్థు లయ్యెదరుగాత.



# ధూర్జటీ!

శ్రీ బులుసు వేంకటేశ్వర్లు, బి. ఏ., గారు

చ. "స్తుతమతి యైన యాంధ్రకవి ధూర్జటి పల్కుల కేలఁగల్గె నీ
యతులిత మాధురీ మహిమ హా యని మెచ్చెను కృష్ణరాయ భూ
పతి మును, దావకీన ప్రతిభాసహితామలనవ్యతత్త్వసం
తతమధురప్రసిద్ధకవితావనితాజనితామృతాప్తికిన్.

చ. నిజముగ నీ కవిత్వసుధ నింపెను మామకహృత్పుటంబు న
క్కజముగ నవ్యభవ్యరసగానము లూరఁగఁజేసె; నష్టది
గ్గజములలోన మేటివనగా గడియించెను గీర్తిచంద్రికల్
సుజనకవిత్వతత్త్వపరిశోధక ఖండలి కింపు గూర్చుచున్.

మ భవనామంబును నీదు నామమును నొప్పారన్ సమానాఖ్య; నా
శివునే నమ్మి శివున్ భజించి శివునే చింతించుచున్ త్వత్కృతుల్
శివపాదాంకితదివ్యకావ్యములుగా శ్రీకాళహస్తీశుపైఁ
జవు లొల్కన్ విరచించి మించితివి నీ జన్మంబు ధన్యంబుగాన్.

మ. కవితైశ్వర్యమహావిరాజితులు నిష్కామప్రభుల్ సజ్జనుల్
కవిరాజుల్ పురరాజులం గని మహోత్కంఠన్ ధనావాప్తి కే
ల విచారింపగ దైన్యవృత్తి నవి యల్పంబుల్ తృణప్రాయముల్
అవివేకప్రభవమ్ము లంటివిగదా త్యాగీ, కవీ! ధూర్జటీ!

ఉ. ధూర్జటి సత్కవీంద్ర! నిను దొత్తను గొందఱు వారకామినీ
స్వార్జితసత్కవిత్వ ప్రతిభాయుతుఁగా వినియుండి రంతె నీ
యూర్జితభక్తిముక్తిజనితోజ్జ్వలదివ్యకవిత్వ మాంధ్రికిన్
స్వార్జిత మంచు నీకు వినయంబున మ్రొక్కెద నోయి ధూర్జటీ!

మ. పరమశ్రావ్య మహాత్మ్యయామలకథాభవ్యంబునై దివ్యమై
నిరతానందసుధాప్రవాహమయమై నిత్యోజ్జ్వలంబై శుభా
కరమై భక్తికి ముక్తికిన్ నిలయమై కామార్థభూయిష్ఠమై
వరలున్ ధూర్జటి! త్వత్కృతిద్వయము తత్త్వశ్రీ నివాసంబుగాన్.

---

# నవ్యసాహిత్య సిద్ధాంతములు

శ్రీ శిరోమణి సన్నిధానము సూర్యనారాయణశాస్త్రి గారు

రమారమి ముప్పది యేండ్లనుండి మన యాంధ్రదేశమున నవ్యసాహిత్య మను నొక విలక్షణ వాఙ్మయము బయలుదేఱిన విషయ మెల్లరకును దెలిసినదే! దీనినిఁ బ్రతిష్ఠించిన యాచార్య పురుషులు కీ. శే. గురుజాడ అప్పారావుగా రని చరిత్రకారులు వ్రాయుచున్నారు. ఆయన యే నామకరణము సేసిరో తెలియదు. కానీ నేఁడు నవ్యసాహిత్య మని వ్యవహారమున నిది యున్నది. ప్రాచీనకావ్యములందు కన్న వీనియం దేదో విశేష ముండవలయును. ఉన్నదని యీ నవ్యకవులు వాదించుచున్నారు. శాస్త్రములం దచ్చటచ్చటఁ బ్రాచీన నవ్య పండిత సిద్ధాంతముల నుదాహరించుచుందురు. అచ్చటఁ బ్రాచీన సిద్ధాంతము కన్న నవ్య సిద్ధాంతమే యుపాదేయమై యున్నదని గ్రంథకర్తల యభిప్రాయము. కావుననే ప్రాచీనమతముల నుద్ధరించి 'నవ్యాస్తు' అని 'తు' అను నవ్యయమును బూర్వమున కన్న వైలక్షణ్యద్యోతకముగాఁ బ్రయోగించుచుందురు. కావున నిచ్చటను నవ్యపదము వైలక్షణ్యద్యోతకముగా నుండవలయును. అట్టి వైలక్షణ్య మేమి? ఈ వైలక్షణ్య ముపాదేయమా అను విషయములు నన్నుఁ జిరకాలమునుండి వేధించుచున్నవి. కావున నిచ్చట వాని నలఁతిగా విమర్శింతును.

## నవ్యత యేమి?

ప్రాచీనకవులవలెనే నవ్యకవులును "వాక్యం రసాత్మకం కావ్యం" అను లక్షణమును బరిగ్రహింతురు. ఆ రసవ్యక్తికిఁ బ్రాచీనాలంకారికులు వ్యంజక సామగ్రిగా నిరూపించిన గుణరీత్యలంకారములును నవ్యుల కుపాదేయములనియే తలంతును. ఆ గుణాదులును దత్తద్రసానుకూలముగా నుచిత విధమున నుండవలయు నను ప్రాచీన మర్యాదను వీరును బాటింతు రనుకొందును. మరియు నలంకార దోషములు, రసదోషములును, బద దోషాదుల కన్న నెక్కువగాఁ బరిహరణీయములను నియమమును గూడ నాదరింతు రనియే విశ్వసించుచున్నాను. ఏలన నలంకార దోషములు రసదోషములును రస ప్రతిబంధకము లగుటచే నవి మిగిలిన వాని కన్న నత్యంత వర్జనీయములు గదా! మరియుఁ గ్లిష్టాన్వయములు సందిగ్ధాది రసప్రతిబంధకము లగు నితర దోషములును ద్యాజ్యములనియే నవ్యులును నంగీకరింతు రని తలంతును. సర్వథా రసవ్యక్తికిఁ బ్రాచీనాలంకారికులు (ధ్వనికారాదులు) నిర్వచించిన లక్షణమును గ్రహింతు రనియే నా దృఢ విశ్వాసము. అట్లు గ్రహింపరా? ఇఁక వారి కావ్యలక్షణ మేమి? "వాక్యం రసాత్మకం కావ్యం" అను లక్షణమును మాత్రమే స్వీకరించి తత్కారణసామగ్రిని మాత్రము భిన్నముగాఁ దెలుపుదురా? ధ్వనికారాదులు రసానంద సిద్ధికిఁ గావలసిన గుణరీత్యలంకారాది కారణ సామగ్రిని నన్యూనాతిరిక్తముగా నిరూపించిరి. అందొకదానినిఁ గ్రొత్తగాఁ జేర్చుటకుఁగానీ తీసివేయుటకుఁగానీ యవకాశము లేనట్లు

కానిపించును. ఈశ్వరుఁడు నిర్మించిన యీ మానవ శరీరయంత్ర భాగములలోఁ బురుషుఁ డొకదానిని దీసివేయుటకుగానీ యొకదానిని విశేషించి యధికించుకొనుటకుఁగానీ యవకాశములేదుగదా! ఇట్లే కావ్యమార్గముగూడ పెద్దలచే నిర్ణీతమై యున్నది.

బ్రహ్మానంద సహోదరమగు రసమన్వయ వ్యతిరేక దృష్టాంతములవలనఁ దత్కారణ సామగ్రి వలననే వ్యక్తమగును. కావున నవ్యకవులీ లక్షణమునందుఁ గొత్తగా జేర్పఁదగిన సిద్ధాంతము లవలేశమును నా బుద్ధికి గోచరింపకున్నది. శ్రీ శంకరాచార్యులు మోక్షమును బొందుటకు నేర్పరచిన మార్గముగాక నేఁడెవరేనిఁ గొత్తగా శ్రుతి యుక్త్యనుభవముల కనుకూలముగా సమీపమార్గము (Short cut) దెలిపినచో నది ధర్మ్యముగాఁ దోఁచునేని తప్పక గ్రహింపవలసినదే! నూత్నముగ్లో మోక్షము లభించినచో నెవరు వలదందురు? అట్లే కావ్యానందసిద్ధికి ధ్వనికారాదులు నిరూపించిన కారణ సామగ్రిఁ గాదని నవ్యకారణ సామగ్రిని, శీఘ్రసిద్ధిఁ గూర్చు దానిని శాస్త్రయుక్త్యనుభవములతో నిరూపించినచో నది న్యాయమగుచోఁ దప్పక గ్రహింతుము. కానీ యట్టి కారణ సామగ్రిని నెవ్వరును నిరూపింపలేరనియే నాదృఢ విశ్వాసము. తద్భిన్నమగు కారణ సామగ్రివలన "జనయతి ఖలు వ్రీహే ర్బీజం న జాతు యవాంకురం" అన్న విధమున రససిద్ధి గలుగదు. కావున నవ్యకవులు తత్కారణ సామగ్రియందుఁ జేర్పఁదగినది కానీ తీసివేయఁదగినది కానీ యావంతయును లేదు.

రమారమి రెండువేల యేండ్ల క్రిందటనే భరతుఁడు మనుష్యుని మనస్తత్త్వమును శోధించి నవరసములను, వానికిఁ బ్రత్యేకముగా విభావానుభావ సంచారి భావములను నిరూపించెను. భరతుని పిమ్మటఁ బెక్కండ్రు సాహిత్య విమర్శకులు పుట్టిరి. కానీ యెవ్వరును వానిలో దోషోద్ఘాటనము సేయఁ జాలరైరి. ఒక దానిఁ దగ్గింపరైరి. ఒక దానిని హెచ్చింపరైరి. అట్లు తగ్గించుటవలనను హెచ్చించుటవలనను రసానందము సిద్ధింపదని వారు గ్రహింపఁగలిగిరి. భోజుని శృంగార రసవాదముగానీ భవభూతి కరుణరసవాదముగానీ వీర నారాయణుని యద్భుత రసవాదముగానీ పండితాదరణము నొందక నామమాత్రములుగా నిలిచిపోయినది. ఈనవ్యకవులును మనప్రాచీనాలంకారికసిద్ధాంతములను బరిశీలించియున్న యెడల వారికాయాథార్థ్యము గోచరించును. కావునఁ బ్రధానమగు రసవ్యక్తీకరణమునఁ జేర్పఁదగిన నవ్యత లేదనుట నిర్వివాదాంశము. ఇఁక నవ్యత యెందున్నది?

ప్రాచీన కావ్యము లన్నియును గ్రాంథిక భాషానిబద్ధములు. నవ్యకావ్యములు వ్యావహారిక భాషానిబద్ధములు. ఇదియే నవ్యతయను కొందమా? అట్లేని నవ్యకావ్యములని పేరొందిన్న కావ్యములలోఁ బెక్కు గ్రాంథిక భాషానిబద్ధములు; నవ్యసాహిత్య గ్రంథములలోఁ బ్రథమ కావ్యమని స్తోత్రములకుఁ బాత్రమైన తృణకంకణము గ్రాంథిక భాషానిబద్ధము. ఇంకను దువ్వూరి రామిరెడ్డిగారి గ్రంథములును దదితరులవి మఱికొన్ని గ్రంథములును గ్రాంథిక భాషానిబద్ధములే. కావున వ్యావహారిక భాషా నిబద్ధత నవ్యత కాదని స్పష్టమగుచున్నది.

ఇఁక ఖండకావ్యరచన నవ్యతా లక్షణమనుకొందమా? ఒకవేళ నిది నవ్యత యనుకొన్నను నిది యుపాదేయమా? వామనుఁడు కావ్యాలంకార సూత్రములందు "తదనిబద్ధం నిబద్ధంచ" "క్రమసిద్ధిస్తయోః స్రగుత్తంసవత్" "నానిబద్ధం చకాస్త్యేకతేజః పరమాణువత్" అని మూఁడు సూత్రముల నుదాహరించెను. దీనియర్థము విస్పష్టముగా గోచరించుచున్నది. "అనిబద్ధమభ్యస్య నిబద్ధరచనాయాం యతితవ్యం" అని కామధేనువ్యాఖ్య. మూలమునందలి వృత్తిలో నీ క్రింది శ్లోక ముదాహృతమై యున్నది.

"అసంకలిత రూపాణాం
కావ్యానాం నాస్తి చారుతా
న ప్రత్యేకం ప్రకాశంతే
తైజసాః పరమాణవః"

(అనిబద్ధ కావ్యములకుఁ జారుత్వము లేదు. ప్రత్యేకముగాఁ దైజస పరమాణువులు ప్రకాశింపవు.)

దీని నెవ్వఁరును గాదనఁ జాలరు. కావున ననిబద్ధకావ్యరచన యనఁగా ఖండకావ్యరచన నిబద్ధకావ్యసిద్ధి కభ్యాసము. మఱియుఁ గవి యొక్క ప్రతిభావిశేష మొక యుద్గ్రంథమున నగోచరించును; ఉద్గ్రంథమువలననే సంపూర్ణమైన రసానందము గలిగింపఁ గలుగును, ఖండకావ్యముల వలనఁ గాదు. ఖండకావ్యములవలన నఖండానంద మెట్లు సిద్ధించును? కవి రసవంతమగు కథను గొని యన్యూనాతిరిక్తముగా నాయాఘట్టములం దా యా రసములను బ్రకాశింపఁ జేయుచుఁ బంచసంధులను జక్కఁగా నిర్వహించుచుఁ గావ్యముల సృజించుట కష్టముగానీ కలికి మీఁదను జిలుక మీఁదను ఖండకావ్యములను వ్రాయుట యొక కష్టమైన కార్యము గాదు. ఈ విషయమున రాజశేఖరకవి కావ్యమీమాంస (బ్రహ్మశ్రీ పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రిగారి ఆంధ్రానువాదము) ౨౦౧ పుటలో నిట్లుగలదు.

"ముక్తకమును జెప్పంగల కవులనంతముగ నుందురు. కానీ సంఘాతమును జెప్పువారు నూర్గురు మాత్రమే. అందునను మహాప్రబంధ నిర్మాతలు కాగలకవులు ఏ ఒకరో యిద్దరో మాత్రమే యుందురు. ముగ్గు రత్యంతము దుర్లభము."

కావుననే ప్రాచీనకవులు ఖండకావ్యముల నిరాదరించి మహాకావ్యముల నారంభించిరి. అపరిణతబుద్ధుల కీ ఖండకావ్యములు సరిపోవచ్చును. కానీ పరిణతబుద్ధులకు సరిపడవు. నేఁటి ఖండకావ్యములవంటివే ప్రాచీనకవుల చాటుపద్యములు, శ్లోకములును. చాటుపదమునకు ఆప్టే నిఘంటువున Pleasing or agreeable words, sweet or coaxing speech, flattery (especially of a lover to his Sweet-heart) అని యర్థమగపడుచున్నది. కావున నేఁటి ప్రణయ గీతికలు విరహగాథలు ప్రణయసమాధులు మొదలగునవి చాటు పద్యములే. పండితరాయల భామినీవిలాసము, భర్తృహరి శతకములు, ఆర్యాసప్తశతి, గాథాసప్తశతి, అమరుకము, వేమనపద్యములు, తిరుపతివేంకటకవుల నానారాజ సందర్శనము మొదలగున వన్నియు, నొకకథతో సూత్రింపఁబడని కావ్యము లన్నియుఁ, జాటుకావ్యములే. కావున ఖండకావ్యము లనుటకన్నఁ జాటుకావ్యము లనుటయే లగ్గు. ముఖ్యముగా నేఁటి కాలమున భగ్నప్రణయమును గూర్చి వ్రాయు

విలాపకావ్యములకుఁ జాటుకావ్యములను వ్యవహార ముచిత మగును.

ఈ చాటుకావ్యములవలన, ననఁగా ఖండకావ్యములవలన నఖండమైన రసానందము సిద్ధింపదు. ఆలంకారికు లఖండానందమును గలిగించుకావ్యములనే యుత్తమకావ్యములనుగా ననఁగాఁ బ్రథమశ్రేణికావ్యములనుగాఁ బరిగణించిరి. ఈ చాటు కావ్యము లల్పానందముఁ గూర్చునవి కావున ద్వితీయశ్రేణిలోనికిఁ జేర్పఁదగినవి. అట్టిచోఁ గ్రిందితరగతికిఁ జేర్పఁదగిన కావ్యములను సృష్టించుట నవ్యతా లక్షణ మగుచో నిది యుపాదేయమగునా? అధినివేశ ప్రతిపత్తి (Dominion status) యే చరమలక్ష్యముగాఁ గోరు మితవాదులను బోలు నవ్యకవులకును స్వాతంత్ర్యసారమును (Independence) గోరు కాంగ్రెసువాదులను బోలు ప్రాచీన పండితులకును దారతమ్యము స్పష్టము.

ఇఁక గేయరచన నవ్యసాహిత్య లక్షణ మనుకొందమా? గేయరచన క్రొత్తది కాదనియు నన్నయకుఁ బూర్వమునుండియు మార్గకవిత దేశికవిత యను రెండుకవిత్వములును ప్రక్కప్రక్కఁగాఁ బ్రవహించు రెండుప్రవాహములవలె వచ్చుచున్నవని నేఁటి నవ్యకవులలోఁ బెద్దలు స్పష్టపఱచుచున్నారు. ఈగేయకవిత్వమునకు మధురకవిత్వ మనియును నామాంతరము గలదు. పూర్వకాలమున యక్షగానములు స్త్రీలపాటలు మొదలగు గ్రంథము లందు వెడలినవి. కావున గేయరచన నవ్యముగాదు. గాంధీమహాత్ముఁడు నేఁటి కాలమున సత్యాహింసలను బోధించుచున్నాడు. ఈ సిద్ధాంతములు నూతనములా ? మఱుగు పడియున్న వానిని బోధించుచున్నాఁడు. కావున గేయరచనయు నట్లే నవ్యముగాదు. ఒకవేళ నయినను గేయకావ్యములే నవ్యకావ్యములై యితరములు కాకపోవలసి వచ్చును. అదియుఁగాక హార్మోనియము మనశ్రుతిని మ్రింగివేయువిధమున గానము కావ్యనీరసతను మ్రింగివేయును. అందులకై యీ గేయమును నవ్యులాశ్రయించిన నాశ్రయింపవచ్చును.

ఈ నవ్యత యేమో తెలిసికొనవలయునను నభిలాషతో నుంటిని. కొందఱు నవ్యసాహిత్య నిర్మాతలు తదభిమానులును వ్రాసిన వ్యాసములను బరిశీలించితిని. డాక్టరు శ్రీ బుర్రా శేషగిరిరావుగారి నవ్యసాహిత్య పరిష దధ్యక్షోపన్యాసమున (బందరు) నవ్య సాహిత్య లక్షణము లేవియు నిర్వచింపఁబడలేదు. వారిది యుద్బోధన అనఁగా నుపదేశము, హితోపదేశ మన్నమాట. ఉన్మార్గమునఁ బోవువారి కుపదేశ మొనర్చుట విబుధలక్షణము. మొత్తముమీఁద వారి యుపన్యాస సారాంశము ప్రాచీనాంధ్రసాహిత్యము "గానటబీనట"గాదనియు నేఁటి ప్రకృతి గానములకన్న "రసభావ భాసురత" గలవానినిఁ బందెమువేసి చూపవచ్చుననియు నయియున్నది. మరియు వారు "వాస్తవానికి మన ఆంధ్రదేశములోఁ గనరాని ప్రకృతి రామణీయకము ఇంగ్లాండులో నెక్కడ గలదు? అయితే మన యువకుల కీ విషయములో స్వానుభవ మెక్కువ గావలె" నని యుద్బోధించిరి. మరియొకచోట "పందొమ్మిదోశతాబ్దపు ఆంగ్ల యువకవులు మానవ జీవితములో లేని ప్రశాంతతను బొందడానికిఁ బ్రకృతిని ఉపాసించినారు. అందా ప్రశాంతతను క్షణికముగానైనా కని యనుభవించి

నారు. అంతవరకైన జీవితములో వెలుగూ అమలమైన ఆనందమూ అనుభవించినారు. మన కవులు జీవితములో ఇంకా కాలుపెట్టీ పెట్టకుండానే ప్రణయ విషాదాన్ని ఉపాసించుచు ప్రకృతి రామణీయకములను దాని కుద్దీపకము చేసికొంటున్నారు. ఇందులో ఏదో నిగూఢమైన వ్యక్తిత్త్వ మిమిడి యున్నది. నాకు గోచరముకాలేదు" అని వ్రాసిరి. ఈ నవ్య సాహిత్యపు పోకడలు డాక్టరుగారికిని నర్థముగాకున్నవి. తుట్టతుదిలో నవ్య ఆంధ్ర కుమారులారా! తమ కీ పూర్వాంధ్ర సాహిత్యమంతా "గానట బీనట" అని దోఁచవచ్చు. దానికి తగవులేదు. కానీ యిట్టి గానటబీనట తప్పుత్రోవలో కాలక్షేపము చేస్తూన్న నేటి అజ్ఞులకు నాటి నన్నయాదులవలె పాశ్చాత్య విజ్ఞాన భారతములగు కావ్యములను బరమార్థ తత్త్వనిస్సంశయకారులగు వాటిని......... సృష్టికి ప్రతిసృష్టిచేయడంలో తమ సాయశక్తులను గలిపి వినియోగింప వలసినది" యని యుద్బోధించిరి.

ఈ యుపన్యాసమునుబట్టి వారికిని నీనవ్యత గోచరింపలేదు. ఈ నవ్యకవుల ధోరణి పెడమార్గమున నున్నదని తేలుచున్నది.

శ్రీరంగము శ్రీనివాసరావుగారి "నేటి తెనుగు కవిత: క్రొత్త పోకడలు" అను రేడియో యుపన్యాసమును భారతిలోఁ జదివితిని. అందు వారు "ఆధునికాంధ్రకవుల రచనలను సరిగా అర్థము చేసుకోవడానికి వాటి వెనుక బానటగా నిలిచిన ఇతరదేశాల సాహిత్యవ్యవసాయాలను గమనించక తప్పదు. నేటి రచనలను విశ్వపర్యాప్తమైన విశాల జీవితంతో సమన్వయించి నిజమైన కవిత్వమేదో కేవలం నిర్జీవ శుష్కానుకరణం ఏదో గుర్తించాలి? అని వ్రాసినారు. దీనినిఁ బట్టి పూర్వ సంప్రదాయానుసారముగా వ్రాసిన కావ్యము నిర్జీవ మనియుః బాశ్చాత్య దేశ సాహిత్యసారము దిగిన కావ్యము నిజమైన కవిత్వమనియును వీరి యభిప్రాయము. శ్రీ బుర్రా శేషగిరిరావుగా రింత యుద్బోధన చేసిరి కానీ వారి కీ పరమార్థము గోచరింపలేదు.

కవి యే భాషాసాహిత్యమునైనను దాను జీర్ణము చేసికొని తన మాతృభాషలో వ్రాసినచోఁ బాఠకలోకము గ్రహింపఁగలుగును. తమకే యాభాసమాత్రముగాఁ దెలిసిన దానిని భావమును బ్రదర్శింప నుచితమగు భాష రాక "అంత ర్గుడగుడాయతే బహిర్వక్తుం న శక్యతే" అన్న విధమున లోపల బాధపడుచుఁ దుది కేదో విధముగా "ఆంకాయ పిచ్చికొండ" అన్నవిధమున భావప్రకటనముఁ జేయుకవులుపాఠకలోకముపాశ్చాత్యసాహిత్యమభ్యసింపవలయు ననుట యేటియౌచిత్యమో బోధగాకున్నది. ఎంతపెద్ద విషయమైనను బోధకు దృఢముగాఁ దెలిసినచో నతఁడు సులభముగాఁ బరులకు బోధింపగలుగును. రామకృష్ణపరమహంసాదులు నిజమునకు గొప్పవిద్యావంతులు గాకున్నను, అపరోక్షానుభూతి గలవారగుటచే నెంతెంత విషయములను, అరటిపం డొల్చిపెట్టినట్లు బోధింపగలిగిరి. స్వానుభవము లేనివారు చెప్పువిధమునకును స్వానుభవము గలవారు చెప్పువిధమునకును హస్తిమశకాంతర ముండును. నేటి కాలమున బెక్కండ్రు నవ్యకవులే పండితుల యుపన్యాసములనో సంభాషణలనో విని

యా యా వేద వేదాంత మీమాంసాది శాస్త్ర విషయములు తమకు క్షుణ్ణముగాఁ దెలిసినట్లు తమకు శాస్త్రపాండిత్యముగూడఁ గలదను భ్రాంతినిఁ గలిగించుటకుఁ దమ కావ్యములం దా యా విషయములను దూర్చుచు నచుంబిత మగు తత్తద్విషయమును సముచిత పదరచనావిధానమునఁ దెలుపఁ జాలక "పట్టీలు" కొట్టుచుందురు. మొదలనే చిల్లుల కడవ. ఆపైఁ దొపుల త్రాళ్ళు. ఇఁకఁ జెప్పెడి దేమి? పైఁగాఁ దమరచన లర్థము గావన్న చో వారు పాశ్చాత్య సాహిత్య మభ్యసింపలేదు కాన నర్థము కాలేదందురు. ఇట్టి వారినిఁగూర్చి వీరియభిమానులు పత్రికలందును ఉపన్యాసము లందును వీరి ప్రతిభను బొగడుచుఁ గైలాన శిఖరమున కెక్కింతురు.

ఇఁక ఇంద్రకంటి హనుమచ్ఛాస్త్రిగారీ నవ్యకవిత్వము "పాతసీసాలలో నించిన క్రొత్త పానీయమే" యని తేల్చిరి. అనఁగాఁ గావ్యకారణ సామగ్రి యంతయుఁ బురాణమే కానీ వృత్తభేద మొక్కటియే భేద మన్నట్లు తేల్చి వైచిరి. సంస్కృత వృత్తములను విడిచి దేశి వృత్తముల నవలంబించుటయే నవ్యత యని సారాంశము. అట్లేని దువ్వూరి, పింగళి, కాటూరి కవుల గ్రంథములును తృణకంకణాదులునునవ్యకావ్యములు గాకపోవలయును. మరియును శాస్త్రిగారు "ఉత్తమ నవకవులు ప్రాచీన కావ్యహృదయములను బాగుగా బోధపఱచుకొని యీ క్రొత్తమార్గములను బట్టినట్లు తోస్తుంది. కానీ అసమర్థులై పాత కావ్యములను జదువలేక ఆ ధోరణిలో వ్రాయలేక ఇందులో దిగినట్లు కనబడడం లేదు." అని వ్రాసిరి. అట్లే శ్రీరంగం శ్రీనివాసరావు గారును "నేటి కవులు అసమర్థతవల్ల పూర్వ సంప్రదాయాలను నిరసించలేదు. ఒకఅశాంతి అసంతృప్తి ప్రబలి అంచులనుదాటే ప్రయత్నాలతో నానాముఖాల వీరు పరుగెత్తుచున్నారు. తాము నిరాకరించి వదలిన సంప్రదాయాల నిజస్థితి అంతస్తత్వం వీరికి తెలియనిది కాదు." అని సెలవిచ్చిరి. ప్రాచీన కావ్యసంప్రదాయాలను జక్కఁగా నెఱిగిన ప్రతిభాశాలికి నే యశాంతియు నసంతృప్తియును గలుగదు. ఏ యశాంతికైనను అసంతృప్తికైనను గావలసిన దివ్యౌషధము మన భారత విజ్ఞాన వైద్యాలయముననే కలదు. కానీ పాశ్చాత్య సాహిత్య వైద్యాలయములకుఁ బోవనక్కఱ పట్టదు. ఈ విషయము ముందుముందు విస్పష్టమగును. మరియును వీరొకతూరి ప్రతిభలో నవ్యకవితా సామగ్రిని నీ క్రిందివిధమున నిరూపించిరి.

నవకవిత

"సిందూరం, రక్తచందనం
బంధూకం, సంధ్యారాగం
పులిచంపిన లేడినెత్తురూ,
ఎగరేసిన మెరుగినిజెండా
రుద్రాలిక నయనజ్వాలిక
కలకత్తా కాళికనాలుక
కావాలోయ్ నవకవనానికి

ఘాటెక్కిన గంధకధూమం,
పోటెత్తిన సప్తసముద్రాల్,
రగులుకొనే రాక్షసిబొగ్గూ,
బుగులుకొనే బుక్కాగుండా
వికసించిన విద్యుత్తేజం
చెలరేగిన జనసమ్మర్దం
కావాలోయ్ నవకవనానికి

రాంబందుల రెక్కలచప్పుడు,
పొగగొట్టపు భూంకారధ్వని,
అరణ్యమున హరీంద్రగర్జన
పయోధర ప్రచండ ఘోషం
ఖడ్గమృగోదగ్రవిరావం
ఝంఝూనిల షడ్జధ్వానం
కావాలోయ్ నవకవనానికి."

ఇట్టిదే నవ్యకావ్యసామగ్రియగుచో నిప్పటి నవ్యసాహిత్య పరిషత్పత్రికటిగములైన కావ్యము లన్నియును గావ్యములే కావని చెప్పవలెను. నవ్యసాహిత్యపరులైనను దీనిని గ్రహింపరు.

కవిసమ్రాట్టు శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు నవ్యసాహిత్య పరిషత్తు నధిష్ఠించి (బెజవాడ) చేసిన యుపన్యాస మందైనను ఈ వైలక్షణ్యమును ఈ నవ్యతను నిర్వచింపరైరి. నవ్యకవులలో వారు గొప్పవిద్వాంసులనియు వినుచున్నాము. విచారింపఁగాఁ బ్రాచీనాలంకారిక మార్గమే యుక్తమైన దని వారు నమ్మినట్లు తోఁచుచున్నది.

ఇఁక శ్రీ రాయప్రోలు సుబ్బారావుగారు ప్రకటించిన రమ్యాలోకమువలన నవ్యసాహిత్య సిద్ధాంతములను దెలిసికొనవచ్చు ననుకొంటిని. కానీ యా గ్రంథనామమే నా కర్థముకాలేదు. గ్రంథమునందలి భాష యార్షభాష. ఏ మహా విద్వాంసులో దానికి వ్యాఖ్యానము వ్రాయవలయును. ననువంటి యల్పజ్ఞున కది యర్థముగాదు. నాకేగాదు, చాలమంది పండితుల కందలి రహస్యము గోచరింపదయ్యెను. పోనిమ్ము, మా మిత్రులగు శ్రీ కురుగంటి సీతారామయ్యగారు ప్రకటించిన సమీక్షవలననైనఁ దెలిసికొనవచ్చు ననుకొంటిని. కానీ యాశాభంగము కలిగినది. అందు సీతారామయ్యగా రీ రమ్యాలోకము నందలి కావ్యసిద్ధాంతములు శ్రీ సుబ్బారావుగారి కావ్యములకు మాత్రమే చెల్లుననియు నితరులకావ్యములకుఁ జెల్లవనియు వ్రాసిరి. దీనివలన నీ రమ్యాలోకము సమస్త నవ్యసాహిత్యమునకును గ్రాహకమగు గ్రంథముగాదు. కాఁబట్టి యీ రమ్యాలోకమువలన 'నవ్యత' యనునేమో గోచరింపదు. ఏలన నిది కేవల మొక్క సుబ్బారావుగారి కావ్యములకు మాత్రమే సంబంధించిన దని సీతారామయ్యగారు వ్రాసిరి. దీనిని సుబ్బారావుగారు గాదనలేదు. పోనిండు, విశ్వనాథ సత్యనారాయణగారైనను నవ్యసాహిత్య పరిషత్తునం దీ రమ్యాలోక సిద్ధాంతములనుగూర్చి ముచ్చటింపరైరి. ఇవి మహోత్కృష్టసిద్ధాంతములేని వారేల తడవరైరి? వారికిని నావలెనే యర్థముగాలేదా? లేక వారి సిద్ధాంతములు భిన్నములా? శ్రీ సత్యనారాయణగారు తమ యుపన్యాసమున నేఁటి కాలము నందలి కవుల నెల్లర నుదాహరించి వీరందఱును నవ్యసాహిత్యనిర్మాతలని వాక్రుచ్చిరి. వారిలో నే నొకఁడను. నవ్యకవులలో నన్నుఁ జేర్చుకొన్నవారు వీ రొక్క రే! శ్రీరంగము వారి పాశ్చాత్య సాహిత్య వ్యవసాయసిద్ధాంతములుగానీ ఇంద్రకంటివారి వృత్త భేదరీతులుగానీ సుబ్బారావుగారి రమ్యాలోక సిద్ధాంతములుగానీ నా కావ్యసుఁనఁ గానరావు. కావున నిది నవ్యసాహిత్యము క్రింది కెట్లు వచ్చును? నా కావ్యము ప్రాచీన కావ్య వాసనావాసితమే. ఇట్టి దీనినిఁగూడ శ్రీ సత్యనారాయణగారు నవ్యకావ్యమని సెలవిచ్చుటచే వీరి సిద్ధాంతములు పూర్వుల సిద్ధాంతములకన్న భిన్నము

లనవలసివచ్చుచున్నది. ఈ విధముగాఁ దల
కొక సిద్ధాంతము. అనుగతమగు సాహిత్య
సిద్ధాంతములు గానరావు.

ఎవరి వ్రాతలవలనను వీరి 'నవ్యత' నాకు
బోధపడలేదు. నాకే కాదు, ఆంగ్లవిద్యాపారీ
ణులగు డాక్టరు బుర్రా శేషగిరిరావుగారికిని
నవగతము కాలేదు.

కొందఱీ నవ్యసాహిత్యమునఁ బాల్గొను
చున్న కవులు ప్రతిభాశాలు రనియు "ప్రతిభా
వ్యుత్పత్త్యోః 'ప్రతిభా గరీయసీ'" యను
నభియుక్తోక్తి ననుసరించి ప్రతిభావంతులగు
వీరు వ్యుత్పన్నులకన్నను మిన్నలను నభిప్రాయ
మును వ్యాపింపఁ జేయుచున్నారు కొందఱు
తమ గ్రంథ పీఠికలలో నీ వాచోయుక్తి నుదా
హరించుచుండిరి. ప్రతిభలేని కేవలవ్యుత్పత్తి
కన్నఁ బ్రతిభావిశిష్టమగు వ్యుత్పత్తియే
గరీయమని యర్థము కానీ వా రూహించిన
యర్థముగాదు. ప్రతిభ రత్నము, వ్యుత్పత్తి
సానరాయి. సానరాయి లేక రత్నమునకు
జిగిరాదు. సహజముగా రత్నముగానిదే సాన
రాయివలన జిగియును రాదు. ఈ విషయము
కావ్యమీమాంసలో (పం. ఆ. నా. శా. గారి
అనువాదము) ౬౯ పుటలో నిట్లున్నది.

"ప్రతిభా వ్యుత్పత్తు లొకదానితో నొకటి
చేరియున్నవని యాయావరీయుఁడు. లావ
ణ్యము లేని రూపసంపదగానీ రూపసంపద లేని
లావణ్యముగానీ సౌందర్యాధిక్యమును వెల్ల
డింపఁ జాలవుగదా! ...... కావునఁ బ్రతిభా
వ్యుత్పత్తిమంతుఁ డేకవి! కాఁబట్టి ప్రతిభా
వ్యుత్పత్తులు రెండును అభ్యాసమునుమూఁడును
గలిసియే కావ్యమునకుఁ గారణము (కారణ
ములు కావు) అని మమ్మటుఁడు తెలుపు
చున్నాఁడు.

"శక్తిర్నిపుణతా లోక
శాస్త్రకావ్యాద్యవేక్షణాత్
కావ్యజ్ఞశిక్షయాభ్యాసః
ఇతి హేతుస్తదుద్భవే"

...(తస్య కావ్యస్య ఉద్భవే నిర్మాణే సము
ల్లాసేచ హేతుః, న తు హేతవః)

కావునఁ గేవలప్రతిభ యున్నఁజాలదు.
అది యన్నింటికన్నఁ బ్రధానమనుట నిర్వివా
దము. ఎంత ప్రజ్ఞాశాలియగు బాలుఁడును
గ్రమశిక్షణమున విద్య నభ్యసింపక పండి
తుఁడు కాఁజాలఁడు. ఏజాతిదైనను మొగ్గ
పువ్వుగానిదే పరిమళింపదు. వ్యుత్పత్తిలేని
ప్రతిభావంతుఁడు తనకుఁ దోఁచిన యొకభావ
మును బ్రదర్శించుటకుఁ దగిన మార్గము
దెలియక ద్రావిడ ప్రాణాయామములు
సేయుచుండును. వ్యుత్పన్నులకా మార్గములు
తెలియును. వ్యుత్పన్నులకందఱకును, ఒక్కటే
ఋజువైన మార్గ ముండును. వారి రచన
పరివృత్త్యసహిష్ణువైయుండును. పరివృత్త్యసహి
ష్ణుత్వమనునది సత్కావ్యలక్షణములలో నొకటి,
పరివృత్త్యసహిష్ణుత యనఁగా మార్పరానిపద
పదవిన్యాసము. ఆయా యర్థములను బోధిం
చుటకు నేయే పదములు మాత్రము సమర్థ
ములో తత్పర్యాయపదములుఁగూడ సమర్థ
ములుగావో యట్టి పదవిన్యాసము సత్కావ్య
లక్షణములలో నొకటి. కావున లోకము
వ్యుత్పన్నుల కావ్యములను గ్రహింపఁజాలును.
కానీ కేవల ప్రతిభావంతులకుఁ దమ యాశ
యములను బ్రకటించు మార్గము దెలియమిని
నెవరికిఁ దోఁప వారిది. అందఱును గుమ్మడికాయ

లంత ముత్యములే! కావుననే నేటికాలమునఁ గేవలప్రతిభావంతుల మనుకొనుచు వ్యుత్పత్తిని గడింపక వ్రాయువారి కావ్యములు లోకమున కర్థము గాకున్నవి. అంతేకాని వాని నర్థముఁ జేసికొనుటకుఁ బాశ్చాత్యసాహిత్యము లన్నియును నాపోశన పట్టనక్కఱలేదు. విజ్ఞానార్జనమునకై పఠింపవచ్చును. ఆ కవులు తమ ప్రతిభకుఁ దోడుగా వ్యుత్పత్తిని సంపాదించి వ్రాసినచో లోకముగ్రహించి యందున్న విశిష్టతకు నానందింపఁగలదు. మహాకవియగు కాళిదాసునకు మహాకవిత్వమును గూర్చినవి ప్రతిభావ్యుత్పత్తులే కాని ప్రతిభ యొక్కటే కాదు.

ఈ నవ్యసాహిత్య నిర్మాతలలోఁ గొందఱు మనస్సులో నెట్లనుకొన్నను బాహాటముగాఁ గాళిదాసుని మహాకవి యని యంగీకరింతురు. ఆతని కావ్యములు విశ్వసారస్వతమున నగ్రస్థాన మలంకరించు నని పాశ్చాత్య పండితులు పెక్కండ్రు ముక్తకంఠముతో ఘోషించుచున్నారు.

'ఫాకు'అను నొక పాశ్చాత్యవిద్వాంసుఁడు మేఘదూతనుగూర్చి యిట్లు పలుకుచున్నాఁడు. "ఐరోపీయుల శోకరసాత్మకసాహిత్యమందు మేఘదూతకు సాటివచ్చిన దొక్కటియు లేదు. (చూ. హిందువుల అధిక్యము - హరవిలాస శారదాగారి Hindu superiority అను గ్రంథమున కాంధ్రానువాదము. పుట 3౯౮) హీరేను పండితుఁ డిట్లనెను. "నిజము చెప్పవలసినపుడు కాళిదాస మహాకవి స్వజాతికే కాక యావత్తు నాగరక మానవలోకమునకు గౌరవమును సంపాదించినవారిలో నొకఁడని పరిగణింపక తీఱదు." (చూ. హిందువుల అధిక్యము ౩౯౮ పుట).

ఈ విధముగా గేథీ, విల్సను, మాగ్డనాల్డు, మాక్సుముల్లరు మొదలగు పెక్కు విద్వాంసులు కాళిదాసుని వేనోళ్ళఁబొగడిరి. కానీ యీతని కీ పదవినిఁ గల్పించిన కారణసామగ్రి యేమి? కేవల ప్రతిభయేనా? వ్యుత్పత్తిలేదా? అతఁ డవలంబించిన కారణసామగ్రి యవలంబించి యితరులును దత్సిద్ధికై ప్రయత్నింపవలయును. కాళిదాసుఁడు రససిద్ధుఁడని యంగీకరింతుమేని యాయన వాఙ్మయమును జదివి యాతనిమార్గమునుగ్రహించి దాని ననుసరించి పోవలయును. ధ్వనికారాదులు కాళిదాసాది మహాకవుల లక్ష్యములను బట్టియే లక్షణముల నిర్ణయించిరి. ధ్వనికారుఁడు కావ్యమునకలంకారము ప్రధాన మను భామహవాదమును, గుణములు ప్రధానమను దండివాదమును, రీతి యాత్మ యను వామనునివాదమును సహేతుకముగా ఖండించి బొత్తుగాఁ ద్రోసిరాజనక, రస మంగిగను వీని నంగములుగను నిరూపించెను. ఇవి వాని వాని ప్రాధాన్యమును గోలుపోయి రసాంగములయినవి. ఈ లక్షణము మహాకవుల లక్ష్యములనుండి గ్రహించెను. మఱియుఁ దత్తద్గుణాలంకార రీతులు సముచితమగు విధమునఁ దత్తద్రసానుకూలములుగా నుండవలయుననియు నలంకార దోషములు, రసదోషములు క్లిష్టాన్వయ సందిగ్ధార్థ పదములు మొదలగునవి రసప్రతిబంధకము లగుటఁ ద్యాజ్యములనియుఁ దెలిపెను. పాశ్చాత్యులు పెక్కండ్రు కావ్యలక్షణములను నిర్వచించిరి కానీ యింత ఋజువుగా నింతలోతుగా విమర్శించి చెప్పిన

వారు లేరు. వెనుక నే నొకతూరి యొక గ్రంథ మును విమర్శించుచు నీ క్రింది

గీ॥ భావభరమైన హృదయదర్పణమునందు
రక్తి లిఖియించుకొంటి నే రమణిరూపు
అదియె ముదమీాక యలంతకాస్పదమయయ్యె
గ్రహణగతమైన చంద్రునికళవిధాన.

పద్యమున "గ్రహణగతమైన చంద్రునికళవిధాన"అన్నయుపమ సరిగా నతకలేదనియు హృదయగతమగు ప్రియురాలు గ్రహణ గతమగు చంద్రికళవలె నున్న దన్న సారస్యము లేదనియు నిం దలంకార ప్రయోజనము శూన్యమనియును, విమర్శించితిని. అంత నొక పండితులవారు 'గ్రహణగతమైన' అనుపదమునకు ఉపరాగగ్రస్తమని యర్థము గాదనియు గ్రహణ గతము అనఁగా స్వీకారము పొందిన అనఁగా 'వివాహమైన' అని యర్థమునుజెప్పి యాపదమును మూఁడవ పాదములోని కన్వయింప వలయుననియు వ్రాసిరి. ఈవ్యాఖ్యానమెంత సమంజసముగా నున్నదో పండితులు గ్రహింపఁగలరు. ఇట్లే పెక్కుచోట్ల న్యాయ్యమగు నన్వయములు వీడి విచిత్రాన్వయములు నేసి పాండిత్యబలమున సమర్థించిరి. ఆవిద్వాంసులు నవ్యసాహిత్యాభిమాను లగుట నవ్యకవులపై నీఁగ వ్రాలినను సైఁపరు కావున నీ విధమున వ్రాసిరి. కానీ వారి యంతరాత్మమైనను దమ వాదమునందలి యాథార్థ్యమును గ్రహింపక పోదు. ఈ విధముగా వారు సమర్థింపఁ బూనుటవలననేయీ నవ్యకవులు తా మెట్టు వ్రాసినను సమర్థనీయముగానేయుండునని తలంచుచుఁ బ్రతిభావంతుల మనుచు వ్రాయుచుందురు.

శ్రీ శంకర భగవత్పాదులవారు "తత్త్వమసి" యను మహావాక్యమునకు తత్,త్వం,అసి, అని సరళమైన వ్యాఖ్యానము వ్రాయఁగాఁ బరమతస్థులు తస్యత్వం తత్త్వం అనియు "అయమాత్మా తత్త్వమసి"అనునెడ అతత్ త్వం అనియును విచిత్రముగా వ్యాఖ్యానించిరి. ఇందెయ్యది న్యాయ్యమగునో దురభిమానము వీడి విచారించిన నవగతము కాఁగలదు. ఈవిషయమును శ్రీతిలకు పండితుఁడు గీతారహస్యము (ఆంధ్రానువాదము) ౩౨౧ పుటలో నిట్లు వ్రాసెను. "తత్త్వమసి" ఈ వాక్యమందున్న పదములయొక్క యన్వయము ద్వైతమతానుసారముగా నెప్పుడును బాగుగాఁ గుదురదు. ద్వైతులకే ప్రతిబంధము తోఁపకపోలేదు. కానీ తత్త్వం=తస్యత్వం - అనఁగా నీ కంటె భిన్నమగుదాని సంబంధుఁడవుగా నీవున్నావు. వాఁడే నీవు కావు. అనియేదో యొకవిధమున నీమహావాక్యమును సమన్వయించి ద్వైతులు తృప్తిఁజెందుదురు. కానీ కొంత సంస్కృత జ్ఞానముండి పక్షపాతము లేక విచారించునెడల నొక్కొక్కనికి నిటులు క్రమముతప్పి చేయుట వలన నేర్పడు నర్థము సత్యము కానేరదని వెంటనే తెలియును. కైవల్యోపనిషత్తున "స త్వమేవ త్వమేవ తత్" అని తత్, త్వం అనుశబ్దములను గ్రమము తప్పనటు లొనర్చి పై మహావాక్య మద్వైత పరముగానే యున్నదని సిద్ధాంతము నేయఁబడినది. వేయేల? మొత్తముపై నుపనిషత్తులయొక్క మంచి మంచి భాగములను ఛేదించి తాఱుమాఱు నేయని యెడలను, తెలిసియు దానియందు దురుద్దేశము బొందని యెడలను ఉపనిషచ్ఛాస్త్రమునందు అద్వైతము తప్ప వేరొకరహస్యమున్నదని నిరూపించుటకు సాధ్యముకానేరదు.

అట్లే యీ పండితుల వారును దమ పాండిత్యపు "జబర్దస్తీ"తోఁ జిత్రవిచిత్రాన్వయములను జిత్రవిచిత్రార్థములను నిరూపించి సమర్థించిరి. కానీ వీరి మార్గము సరసమైనది కాదని వీరియాత్మ వీరికి బోధింపక పోదు. కావున నలంకారాదులు రసోచితముగాఁ గూర్చినఁ గానీ రసానంద హేతువులుగాఁ జాలవు. పాశ్చాత్యాలంకారికుల యలంకారములకన్న భారతీయాలంకారికుల. యలంకారములు రసోపస్కారకములు. వీనియందలి యౌచిత్యము వానియందు మృగ్యము. భారతీయాలంకారికు లుపమకు బింబప్రతిబింబ సాధారణధర్మాదు లుండవలె నందురు. పాశ్చాత్యులు దీనినిఁ బాటింపరు. ఒక చిన్న వాక్యమున నున్న యుపమేయమునకు రమారమిపదిపఙ్క్తులు ఒక్కొకచో నిరువదిపంక్తులును గల యుపమానమును వాడుదురు. బింబమునకన్న బ్రతిబింబమున లవలేశమును హెచ్చుతగ్గు లుండని విధమున నుపమానోపమేయ వాక్యములు హెచ్చుతగ్గులు లేకుండ నుండవలయు నన్న యౌచిత్యముయొక్క విలువ యెంతని వర్ణింపఁగలము? ఇప్పట్టునఁ గాళిదాసమహాకవి వాడిన యుపమాలంకారములును, మాథ్యూఆర్నాల్డు ప్రభృతులు వాడిన యుపమాలంకారములును బోల్చిచూచినచో నేవి రసోపస్కారములో యేవికావో తెలియును. కావున రసోచితముగా నలంకారములను గూర్పవలయును.

మరియు నిప్పటి నవ్యకవులలోఁ గొందఱు నన్నయ శ్రీనాథాదులవలె దీర్ఘసమాసములను వాడుచుందురు. సమాసమునకు నొక్క నియమముగలదు. అచ్చటచ్చట అదూరదర్శిత్వాద్యసమర్థ సమాసములున్నను మొత్తముమీఁద సమాసమునకు నేకార్థభావ ముండవలయును. అది లేనిచో సమాసమును జేయరాదు. ఈ విషయము "సమర్థః పదవిధిః" అను సూత్రము విశదీకరించును. ఈ విషయమునే భండార్కరు II వ పుస్తకములో ౧౩౪ పుటలో నిట్లు వ్రాసెను. It should by no means be supposed that any noun may be compounded with any other in any sense. The Sanskrit idiom allows of certain compounds only and not others. Ignorant persons, not knowing this put-forth as Sanskrit what is by no means so............

ఈ నవ్యకవుల సమాసము లేశాస్త్రమునకు లొంగక కత్తిపీటకు ముదురు సొరకాయలవలె నెదురుతిరుగును. కాన నర్థస్ఫూర్తి గలుగదు. అట్లగుట రసస్ఫూర్తికిఁ బ్రతిబంధము. ఒకప్పు డొక నవ్యకవి మిత్రుఁడు "రాజసేవకుఁడు చూచెను" అను వాక్యమునందలి రాజసేవకుఁడను సమాసమునకు రాజుయొక్క సేవకుఁడని యొక్క యర్థమే యేల చెప్పవలెను? 'రాజును సేవకుఁడు చూచెను.' అను నర్థమేల చెప్పరాదు? అని వాదించి నేను గాదనఁగా నాతోఁ దగవులాడి నన్ను శాస్త్రమూఢునిఁగాఁ దలఁచినాఁడు. ఆతఁ డీ విధముగా నర్థమును దీసినపుడు మరొకఁడు రాజుతో సేవకుఁడు చూచెనని యర్థము చెప్పవచ్చును. మరొకఁడు సేవకుఁడు అన్నపదమునకుఁ బ్రథమావిభక్త్యర్థ మేల చెప్పవలెను? "రాజు సేవకునిఁ జూచెను" అను నర్థమేల చెప్పగూడదు? అని యడుగును. మరొకఁ డివి యన్నియును ధ్వనులని వాదించును. వీనికేమి సమాధానము వచింపఁగలము. భండార్కరు

గారి వాక్యములే వీరిని సమాధాన పఱపవల
యును.

కావున నవ్యవస్థమగు మార్గమును వదలి
శాస్త్ర నియమానుసారముగా సమాస
ముపయోగింపవలయును. అట్లు గాకున్న
నొకరి ప్రయోగ మొకరి కర్థము గాకపోవలసి
వచ్చును. మరియును 'అర్థి' అను సంస్కృత
పదమునకుఁ గోర్కితోనని యాంధ్రమున
నర్థము గలదు. ఈ యర్థము సంస్కృతమున
లేదు. అచ్చట 'యాచకుఁడు' అనియే
యర్థము. అది తెలియక 'ధనమునందలి కోరి
కతో' అనునర్థమున ధనార్థి అని ప్రయో
గింపరాదు. ఈ కాలమునం దీ నవ్యకవులు
సంస్కృతభాషా మర్యాద నెఱుఁగక యీ
విధముగా సమాసములు చేయుదురు. ఈ
దోషములు పెద్దకవులనఁబడు వారిలో వందలు
వేలును గలవు. కావున సంస్కృతభాషా
మర్యాద నెఱిఁగి సమాసమును బ్రయోగింప
వలయును. మరియును గొందఱు వ్యవహార
సిద్ధములుగాని రేఖించు, నుడికరించు మొద
లగు పదములను వాడుచుందురు. వ్యవహార
సిద్ధి లేకపోవుటవలన నిట్టివి రసప్రతిబంధకము
లుగాఁ బరిగణింపఁబడును. వ్యవహారసిద్ధములు
గాని 'వృక్షకొమ్మ' ఇత్యాదిపదములు శ్రవణ
తాడితములు కాఁగానే వెగటుగలుగును. 'శుద్ధ
తప్పు, అనేకమంది' మొదలగునవి వ్యవహార
సిద్ధము లగుటచే శ్రావ్యములుగా నుండును.
వ్యవహారసిద్ధి లేనిపదములు రసప్రతిబంధకము
లగుటచే నాలంకారికులు దుశ్శ్రవనాది పద
ము లప్రయుక్త దోషములుగాఁ బరిగణించిరి.
ఈవిధముగా తమ భావమును స్పష్టీకరింప
వలసిన విధమున స్పష్టీకరింపక పాశ్చాత్య
సాహిత్యము నేర్చుకొన్నఁగానీ నవ్యకావ్యము
లర్థము గావన్నచో నేమనవలయునో బోధ
గాకున్నది.

ఒకతూరి నే నొక గ్రంథమును విమర్శిం
చుచు నొక కవి వ్రాసిన "కాల చపలుఁడు"
అను సమాసము దుష్టమనియుఁ జపలుఁడగు
కాలుఁడు లేక 'చపలకాలుడు' అని యుండ
వలయు ననియు వ్రాసితిని. దాని కొక వ్యాక
రణ తీర్థులవారు' కాలః చపల ఇవ 'అని
పురుష వ్యాఘ్రాదివలె నుపమితసమాస మని
సమర్థించిరి. పురుషవ్యాఘ్ర మన్నపుడు
పురుషో వ్యాఘ్ర ఇవ అని విగ్రహము చెప్పి
నటులు కాలశ్చపలఇవ అనిచెప్పినచో ద్యోత్య
మగు సామాన్యధర్మ మేమి? చపలత్వమే
సామాన్యధర్మమును నుపమానమును నగునా?
కాలుఁడు చపలుడుగానీ చపలుని వంటివాఁ
డనుట యుచితమా? వారు వ్యాకరణతీర్థులు.
వారికి వచ్చినంత వ్యాకరణము నాకు రాదు.
ఐనను బెద్దలవల్ల నీసమాసము దుష్ట మనియే
విన్నాను. పై రాజసేవక సమాసమును వీరు
అసమర్థసమాసముగా సమర్థింతురు. ఈవిధ
ముగా నొక యసత్యమును గప్పి పుచ్చుటకు
మరొక యసత్యము నాడినవిధమున నొకతప్పు
సమర్థింపఁబోయి మరొకతప్పు చేసిరి. అయి
నను "వృద్ధా స్తే న విచారణీయచరితాః" అని
మానమును వహించుటయే యుచిత మని
యిట్టివారికి నేను సమాధానము చెప్పలేదు.

పూర్వుల కవిత రాజసౌధములందుఁ బెరి
గిన దనియు నాధునికుల కవిత జన సామాన్య
ములలో నైక్యమై తిరుగు చున్నదనియును
గొందఱు పెద్దలు వచించుచున్నారు. కావ్యము
కాంతాసమ్మితమని యెల్లరును నంగీకరిం

తురు. కాంతాసమ్మిత మనఁ బ్రియకాంత తన పతిచిత్తము తన సద్గుణ పుంజముచే నాకర్షించి వానిని సదాచారబద్ధునిఁ గావించు విధమునఁ గావ్యమును శ్రోతను రసాస్వాదన పురస్సరముగా సదాచార నిబద్ధునిఁ గావింప వలయును. "కాంతాసమ్మితతయోపదేశయుజే" అని మమ్మటుఁడును "ధర్మార్థకామమోక్షేషు వైచక్షణ్యం కలాసుచ, కరోతి కీర్తిం ప్రీతిం చ సాధుకావ్య నిషేవణమ్" అని అగ్నిపురాణ కర్తయు "సదాచారోపదేశరూపాహి నాటకాదిగోష్ఠీ వినేయజనహితార్థమేవ మునిభి రవతారితా" అని ధ్వనికారుఁడును వివేచించిరి. కావున సర్వోత్తమమగు ధర్మమును బోధించు పాత్రి లుదాత్తులుగా నుండవలయును. కాన ధీరోదాత్తుఁడు నాయకుఁడై యుండవలయు ననిరి. సామాన్య జనులలో నేని ధీరోదాత్తుఁ డున్నచో వానిని నాయకునిగా వరింప వచ్చును. మహారాజే కావలసినపనిలేదు. బ్రహ్మశ్రీ మంగిపూడి వేంకట శర్మగారు వ్రాసిన మడ్డుకతలోని నాయిక సామాన్యురాలు. కానీ యుదాత్త. మేఘసందేశమున యక్షదంపతులు సామాన్యులుగదా! అట్టి వారి ప్రణయాదులు గ్రాహ్యములే యగును. ధర్మైకపక్షపాతులగు పూర్వు లుదాత్తుఁడు నాయకుఁడుగా నుండవలయు ననుటలో దోసఁగులేదు. "ఆనందో బ్రహ్మ" యను వాక్యమునకు వ్యాఖ్యానము చేసిన వరూథినిని గుల దైవముగా ధ్యానించుచు మా కుపదేశముతోఁ బనిలేదు. ధర్మముతోఁ బనిలేదు. కేవలానందమే ప్రయోజన మని నొడువు చార్వాకమతస్థులతో మాకును బనిలేదు.

ఇక గ్రంథాదియందు దేవతా ప్రార్థనము గురుస్తుతి, సత్కవిస్తుతి మొదలగు వానిని విడిచినంత మాత్రమున నది నవ్యత యేమో విచారింతము. ప్రాచీనులు మనకన్న వేయి మడుంగులు మతధర్మములం దాదరము గల వారు. మనకుఁ బాశ్చాత్య నాగరకతా సంపర్కమువలనఁదదాదరమునన్న గిల్లినది. సర్వథా తదనుకరణమే తదనుసరణమే మోక్షోపాయ మని తలఁచు చున్నాము. సామాన్యముగాఁ బ్రాచీనకవులలోఁ జాలమంది యితరగ్రంథములతో పాటు ప్రతివారును నొక్కొక్క శతకమును వ్రాయుచు వచ్చిరి. ఇదియే వారి భక్తికి సాక్షి. వారిమత ధర్మనిష్ఠకు నాశ్రయము. మనకు భక్తి నన్నగిల్లుటచే శతకాదులం దాదరము పోయినది. భక్తియనునది నవనాగరక ధర్మములలో నొకటిగాఁ బరిగణింపఁ బడక యది యవివేకచిహ్నముగా గణింపఁ బడినది. ప్రిప్రథమమునసే వారు శతకమును వ్రాసి మహాకావ్య మారంభించు చుండెడి వారు. వారేవనినిఁ బ్రారంభించినను గుల దైవమునో యిష్ట దైవమునో ధ్యానించి ప్రార్థించి యారంభించెడివారు. వ్యాఖ్యాతలు "గ్రంథస్య నిర్విఘ్నపరిసమాప్త్యర్థం" అని మంగళశ్లోకమున కవతారికలు వ్రాయు చుందురు. నిజముగా విచారింపఁ బూర్వులా విధముగా దైవధ్యానముతో నారంభించుచు "పలికించెడి వాఁడు రామభద్రుండఁట" అన్నట్లు దైవమే తమచేఁ బలికించుచున్నట్లు భావించుకొనుచు వ్రాయుచుండుట వలననే యా కాలమున నంతంత మహాగ్రంథములను వ్రాయఁ గలిగిరి. ఈ నడుమ బ్రిటిషు గవర్నమెంటువారు యుద్ధములో, దమకు విజయము గలుగుటకై దైవమును బ్రార్థించుటకు నొక

దినమును బ్రత్యేకించిరను విషయ మెల్ల రెఱిఁగినదే కదా! ఈ యిరువదవ శతాబ్దమున నీ ప్రకృతిశాస్త్రయుగమున నీ మారణయంత్ర కాలమునఁ బురుషకారముకన్న నన్యసాధనము లేదనుకొను కాలమున దైవప్రార్థన మవసరము కాఁగా మత ధర్మావలంబులగు ప్రాచీనకవులు దైవప్రార్థనముఁ జేయుచు గ్రంథారంభమును జేసినారన్నఁ దప్పిదమేమి? మఱియుఁ దమజ్ఞాన నేత్రమును దెఱచిన విద్యా గురువులను ఎవరి గ్రంథములఁ జదివి తా మీ విజ్ఞాన మార్జించిరో వారిని ననఁగా సత్కవులను స్తుతి సేయుట కృతజ్ఞతాలక్షణము గదా! వా రావిధముగాఁ దమకృతజ్ఞతను గ్రంథబద్ధ మొనర్చుట స్తోత్రపాత్రముగాదా! మరియు మిడిమిడి జ్ఞానము గలిగి గ్రంథచౌర్యముఁ జేయుచు "అల్పవిద్యో మహాగర్వః" అన్నట్లు ప్రతిభావంతుల మని పెట్టువీఁగుచున్న వారినిఁ గుకవులనుగా గణించి వారిని నిరాదరించి వైచిరి. ఇందేమి దోసఁగు కలదు? వివేకి పూజ్యులను బూజించుటయు నపూజ్యుల నాదరింపకుంటయు నుచితమే కదా! ఇంతేకాదు.

> "నా కవిత్వ మధర్మాయ
> మృతయే దండనాయ వా
> కుకవిత్వం పునస్సాక్షా
> న్మృతి మాహు ర్మనీషిణః"

అని ఘోషిల్లినారు. సాంక్రామిక మగు వ్యాధివంటిదే కుకవిత్వము.

నేఁటి నవ్యకవిత్వములోఁ జాలభాగము దీని క్రిందికి వచ్చుననుట సత్యదూరముగాదు.

కావునఁ గావ్యారంభమున దేవతాస్తోత్రాదుల వలనఁ గావ్యానందమునకు హానియు వానినిఁ దీసివేయుటవలనఁ గావ్యానంద సిద్ధియును గలుగదు. "వాగర్థావివ సంపృక్తౌ" అని ప్రారంభింపఁబడిన రఘువంశము "అస్త్యుత్తరస్యాం" అని "కశ్చిత్కాంతా" అనియును బ్రారంభింపఁబడిన కుమారసంభవ మేఘసందేశములకన్నఁ దీసి పోయినదా? ఒకతూరి శ్రీ అక్కిరాజు ఉమాకాంతముగారు రఘువంశములోని మొదటి నాలుగు సర్గలలో నున్న కవిత్వము ప్రపంచసాహిత్యములో మొట్టమొదట నిలువఁ దగినదని యుపన్యసించిరి. అట్టి యెడ దైవ ప్రార్థ నాదులు దూష్యములుగావు సరిగదా, స్తుత్యములు నగును. పిలక జుట్టును బెట్టుకొన్న వానికన్న "క్రాపు" పెట్టుకొన్న వాఁడు మహత్తరుఁడు కాఁజాలఁడుగదా! వారివారి గుణములనుబట్టి వారివారి యోగ్యత స్పష్టమగును. కావున రసమును బట్టి కావ్యమున కుపాదేయత్వము గలుగునుగానీ దైవప్రార్థనాదుల హానోపాదానాదులవలనఁ గానీ గేయఖండకావ్యరచనలు, సామాన్య నాయికా నాయక స్వీకారము, వ్యుత్పత్తిలేని కేవల ప్రతిభావత్త్వము మొదలగువానిచేఁ గానీ యుపాదేయత్వము సిద్ధింపదు.

శ్రీ శంకరాదులు నిర్వచించిన మతధర్మములలో నే స్వల్పాంశమునో స్వీకరించి యీ కాలమునఁ బెక్కుమతములను (సత్సంగి, కుసుమహరనాథ బాబా ఇత్యాదులు) స్థాపించుచున్నారు. నిజముగా శంకరాద్వైతమెల్ల మతసిద్ధాంతములకును మేలుబంతియని పాశ్చాత్యులును నంగీకరించియున్నారు. (చూ. హిందువుల ఆధిక్యము) కావునఁ బరమత సిద్ధాంతములు క్రిందిశ్రేణిలో నున్నవి. శంకరాద్వైతసిద్ధాంతమును దృఢముగా నవగత

మయ్యేనేని పరమతస్థాపన కవకాశము లేదని నిష్పక్షపాతముగా నంగీకరింప వలసియున్నది. అట్లే ధ్వనికారాద్యలంకార మతము చక్కఁగా నవగతమయ్యేనేని పరసిద్ధాంతము లకుఁ దావులేదు. ఏసిద్ధాంతమైనను దాని యేకదేశాంశమునే బోధించును. అనఁగా నొకటి రెండు మెట్లు క్రిందుగానే యుండును. కావున మనకు నుత్తమ సిద్ధాంతములు, అవ్యాప్త్యతివ్యాప్త్యసంభవాది దోషస్పర్శ లేనివి, మనకన్న నెల్లవిధముల విజ్ఞానులు ప్రతిపాదించిన వుండఁగా మిడిమిడి జ్ఞానములో నధమ శ్రేణికిఁ జెందిన సిద్ధాంతములను లేవదీయుట, తెలియనివారు వానికి హంగుసేయుచుంటయు హాస్యాస్పదము గాదా! కావున నవ్యసాహిత్య సిద్ధాంతములకు దావుగానీ యర్థముగానీ లేదు.

ఒకప్పుడు శ్రీ నోరి నరసింహశాస్త్రిగారు ప్రతిభలో "ఆంధ్రదేశమున 900 సంవత్సరములనుండి కవులు సాధింప లేనిది నవ్యకవులు సాధింపఁ గలరని వ్రాసిరి. ఇదియే యభిప్రాయమును శ్రీ తిల్లావజ్ఝల శివశంకరశాస్త్రి గారును నొకప్పుడు నాతో వెల్లడించిరి. వారు సాధింపలేక పోయిన దేదో వీరు సాధింపఁ గలిగిన దేదో విస్పష్టము చేయరైరి. కావ్యమున సాధింపఁ దగినది రసము. 'సాధ్యో హి రసో యథాతథం కవిభిః'' అనికదా! యభియుక్తోక్తి. కావునఁ బ్రాచీనకవులు సాధింప లేని రసమును నవ్యకవులు సాధింతురని యర్థమయియుండును. అనఁగా మనయాంధ్ర భాషలో రసవంతమైన గ్రంథములు లేవని వారివాదము. ఈ యభిప్రాయముతో నెందఱేకీభవింతురో నాకుఁ దెలియదు. బహు

శ్రుతులు దీర్ఘదర్శులునగు కీర్తిశేషులు కొమర్రాజు లక్ష్మణరావుగారు హిందుమహాయుగమున ౨౧౨ పుటలో నిట్లు వ్రాసిరి.

"ఈ కావ్యము (ఆంధ్ర మహాభారతము) తెలుఁగు బాసలో నద్వితీయము. ఇన్ని నియమములు పాటింపుచు నింత చక్కఁగా నింత కావ్యము జగత్తులోని మరి యే కవియు వ్రాయలేదని చెప్పినఁ జెప్పవచ్చును. ఒక్క యాంధ్రంబున నేల? పృథివియందలి యన్ని భాషలలోను గల యుత్తమ కావ్యములలో నిదియొక్కటి యని చెప్పక తప్పదు."

మరియును ౨౧౩ పుటలో నిట్లు వ్రాసిరి.

"షేక్స్పియరు, మిల్టన్, మొదలగు కవుల గ్రంథములను ఇంగ్లీషువారు చదివినటులు మన వారింక సంస్కృతాంధ్రభారతములను గావ్యరసాస్వాదన లోలురై చదువుదురేని యాంధ్రభారతముయొక్క నిజమైన వైభవము వారికిఁ గానవచ్చును."

కావుననే యితర దేశభాషలందున్న యుత్తమ కవులవంటి కవులు మన యాంధ్ర భాషలోఁ గలరని స్పష్టము. శ్రీడాక్టరు రామలింగారెడ్డిగారును కవిత్వతత్త్వ విచారములో తిక్కన నూరనలను గడుంగడుఁ బొగడిరి. అట్టి యెడ మన భాషలో నుత్తమ కవులు నేటివఱకు బుట్టనే లేదనియు నీ భాషా క్షేత్రమంతయును జవుడు బాఱియున్నదనియు నవ్యకవు లీ భూమిని సాగుసేసి బంగారు పంటను బండింతు రనియుఁ దెలుపుట కేవల సాహసముగాదా!

పోనిండు! ఆంధ్రభాషలో రసవత్కావ్యములు లేవని వాదమునకు నంగీకరింతము.

దానికై మనము యత్నింప వలసినదే. అట్టి యెడ లోకోత్తరుఁడగు కవిని లక్ష్యముగాఁ గొని యాతని కావ్యములను బఠించి లక్ష్య లక్షణముల సమన్వయ మెఱింగి యా మార్గమునఁ బోయిననేకదా, తత్సిద్ధి కలుగును. అట్టి కవి మన దేశమున నే యున్నాఁడు. అట్టి లోకోత్తరుఁడగు కాళిదాసకవినిఁ గడుపారఁ గన్న భారతమాత పుణ్యాత్మురాలు. అతఁడు మన భారతీయుఁ డైనందులకు మనము గర్వింపవలసినదే. నిజమునకుఁ గాళిదాస మహాకవివంటివాఁడు (ఆంధ్ర దేశమున నే కాదు) ప్రపంచములో నెచ్చటను జన్మింప లేదని పాశ్చాత్యపండితులు పెక్కండ్రు వ్రాసిన వ్రాతలు చూడ నెవ్వనిమేను పులకరింపదు? అట్టిచో మన యాంధ్రభాషలో రసవత్కావ్యములు లేవనితోఁచినను, ఉన్నవనుకొన్నను లోకోత్తర కవుల కావ్యములను బఠింప వలయును. కావున మనయార్యసభ్యతను దెలుపు సంస్కృత సాహిత్యము నభ్యసించి వ్యాస, వాల్మీకి, కాళిదాసాది మహాకవుల మహత్త్వమును గ్రహించి వారి కావ్య మార్గమునుబట్టి పోయితిమేని మన ముత్కృష్టగతికిఁ బోఁగలుగుదుము. కానీ శ్రీరంగము శ్రీనివాసరావు గారు చెప్పినవిధమునఁ బాశ్చాత్య సాహిత్యములకుఁ బరుగిడినచో నికృష్టస్థితికిఁ బోవుదుము. ఆంధ్ర భాషలో వారికి ననంతృప్తి, అశాంతియును గలిగినచో భారతవిజ్ఞాన సాహిత్యమునకుఁ బోవలయును. భారత విజ్ఞానము లోకమునకు మేలుబంతి. భారతీయులు పాశ్చాత్త్యులకన్న మిన్నగా నానాశాస్త్రములు చతుష్షష్టికళలు, జ్యోతిషము, ఖగోళము, మొదలగు పెక్కువిషయములందు సర్వతోముఖమైన గంభీరమైన విజ్ఞానమును సంపాదించి యుండిరి. ఇంతేకాదు. కావ్యనిర్మాణమునందును వారిదే పైచేయి. హరవిలాస శారదాగారి (Hindu Superiority) అను గ్రంథమును జూచిన భారతీయ విజ్ఞానమే ప్రపంచమునకు నాచార్యస్థానమని తెలియగలదు ఇప్పుడు పాశ్చాత్యులు కన్నులు తెరచి తమ యశాంతిని, అసంతృప్తినిఁ బోఁగొట్టుకొనుటకై భారతదేశ విజ్ఞానమునకు మోకరిల్లి యాశ్రయించుచుండ శ్రీనివాస రావుగారు పాశ్చాత్య దేశసాహిత్యము వైపునకుఁ బరువెత్త వలె ననుట "ఇంటి యందలి పంచభక్ష్య పరమాన్నముల కన్నఁ బొరుగింటి పుల్లకూరరుచి" యన్నట్లున్నది. కావున బెల్లముఁ బారవైచి యాకు నాకినట్లు మన లోకోత్తరకవికావ్యమార్గములను వీడి పాశ్చాత్యకావ్యమార్గమునకుఁ బోవలసిన యవసరము లేదని నావిన్నపము. జ్ఞానాభివృద్ధికై పాశ్చాత్య సాహిత్యమును జదువవచ్చును. కాని మన కదే యుపాదేయము గాదు.

దీనినిఁ బట్టి పూర్వకవిసంప్రదాయముల ననుసరించిన నే రససిద్ధి కలుగునని నిష్కృష్టార్థము. నవ్యకవులు సింహావలోకనము సేయవలెను.

### కఠోపనిషత్తులో

"పరాంచిఖానివ్యతృణత్స్వయంభూ స్తస్మాత్పరాజ్ పశ్యతి నాంతరాత్మన్–" అన్న విధమున నవ్యకవులకుఁ బరాగ్దర్శిత్వమే కానీ ప్రత్యగ్దర్శిత్వము లేదని తోఁచుచున్నది. "నానృషిః కురుతే కావ్యం" అన్నారు పెద్దలు. ఋషి యనఁగాఁ బ్రత్యగ్దర్శియే కదా! ఆధునికులలోఁ గొందఱు – పింగళి, కాటూరి, దువ్వూరి,

ప్రభృతులు పూర్వసంప్రదాయములను బరిత్యజింపకున్నారు. కావుననే వారికావ్యములు రసానందము గలిగించుచున్నవి. ఆకారణ సామగ్రిని వీడిన పెక్కండ్రి కావ్యములకుఁ గావ్యత్వము లుప్తమైయున్నది.

వ్యావహారిక భాష గానిండు. గ్రాంథిక భాషగానిండు; ఖండకావ్యముగానిండు; మహాకావ్యము గానిండు; పద్యము గా నిండు; పాట గానిండు; ఉదాత్త నాయకము గానిండు. సామాన్య నాయకము గానిండు-వక్త యొక్క ప్రతిభావ్యుత్పత్త్యభ్యాసములనుబట్టి కావ్యమునకు గుణము గలుగును. దానివలన గ్రంథ ముపాదేయ మగును.

ఈ విషయమునే కాళిదాసకవి:—

"పురాణ మిత్యేవ న సాధు సర్వమ్
న చాపి కావ్యం నవ మిత్యవద్యం
సంతః పరీక్ష్యాన్యతర ద్భజంతే
మూఢః పరప్రత్యయనేయబుద్ధిః."

అన్నాడు. ఇందు "సంతః పరీక్ష్య" అన నేమి? పండితులు విమర్శించి యనికదా! యర్థము. గ్రంథమును విమర్శించుట యన నేమి? అందలి రసభావపాత్రౌచిత్యాదులు విమర్శించుట. దానిచేఁగావ్యమున కుత్తమత్వాధమత్వములు గల్పింపవలయును. అంతేకానీ యది ప్రాచీన మైనను నవ్యమైనను వచ్చిన విశేషములేదు. రసహీనమగుచోఁ బ్రాచీన కావ్య ముపాదేయమును గాదు. సరసమగుచో నవ్యకావ్య మనుపాదేయమును గాదు. నేటి పండితులు నవ్యకావ్యములను దెలియక ద్వేషించుచున్నారని యనుకొనవలదు. తెలిసికొని యందు రసాదులు లేవనియు నిర్గంధ కుసుమములనియు ద్వేషించుచున్నారు. రసభావాదులు గల వానిని శిరసావహించుచున్నారు.

ఈ నవ్యసాహిత్య పరిషద్గ్రంథములందు, దాదాపన్ని గ్రంథములందును, నవ్యత యేమియు గోచరింపదు. కానీ పూర్వకావ్యముల కన్న నివి యాకర్షణీయమగు విధమున ముద్రింపఁబడు చున్నవి. ఇదియే వీని విశిష్టత. దీనినిఁగూర్చిన ముద్రాపకులకు ధన్యవాదములు.

## శ్రీ మటికె నాగయ్యగారి ధర్మనిలయ వార్షికోత్సవము

పద్ధతిప్రకారము ఇదే చిత్రభాను శ్రావణ బ॥ ౧౦ మంద వాసరమున శ్రీ మటికె నాగయ్యగారి ధర్మనిలయమునందు శ్రీ వీరభద్ర విశ్వేశ్వరులకు విధ్యుక్తముగ అభిషేకాదులు జరుపబడెను. తరువాత భక్తమహేశ్వర గణారాధనయు సంతృప్తిగా నెరవేరెను. సాయంకాలము శ్రీ పిడుపర్తి బసవకోటయ్యగారు, "మార్కండేయుని గూర్చి హరికథను హృద్యముగా చెప్పి శ్రోతలను ఆనందపరచి సందువలన నిలయాధికారులగు పం. చి. మ. వీరభద్ర శర్మగారు తమ గురుకుల పక్షమునుండి శ్రీ బసవ కోటయ్యగారికి "హరికథా భూషణ"యను బిరుదమును ప్రదానించి సన్మానించిరి.

# శ్రీకృష్ణదేవరాయలు!

శ్రీ అమరవాది వేంకటశాస్త్రిగారు

అరినృపతరుణీనయనాం,బురుహద్వయగళిత ధవళముక్తాఫలసం
భరితధరిత్రీపాలన, కర! రిపుహర! కృష్ణరాయ! కరుణాప్రియా! ౧

ఈ నాఁటికైన మఱేనాఁటికైనఁ దె,నుంగు వాక్కునకు మెఱుంగు గలుగ
ఈ నాటికైన మఱేనాఁటికైనఁ, బ్రబంధ కల్పనకు సుగంధ మలర
ఈ నాఁటికైన మఱేనాఁటికైన స,త్కవితా స్వరూపంబు నవయకుండ
ఈ నాఁటికైన మఱేనాఁటికైన వి,ద్యాగురుత్వంపు విఖ్యాతి నిలువఁ
జేసితివి కట్టుదిట్టంబు సృష్టినిలుచు, నంతవఱకును బ్రవహించు నాంధ్రవాహి
ని దరులానియ్యాని తరంగనినద మల్ల, నల్లన విపంచికాస్వన మనుకరింప. ౨

ఓ తుళువాన్వవాయకలశోదధిపూర్ణ శశాంక! కావ్యవి
ఖ్యాతచరిత్ర! నీవు కొలువైన సభాస్థలి నాంధ్రవాణి యు
ద్యోతితనాట్య మాడె శ్రుతితో! విననయ్యెను నేడు నామృదం
గాతత తేహిత త్తహిత హాధిత ధంధణ ధింధిమిధ్వనుల్. ౩

ఎటు లింకిపోవు నా నిటలాక్షుపృథుజటా,గళితగంగోజ్ఝిత కావ్యధార
ఎటుదాగి పోవు నా నటదీశఘనశిర, స్స్ఫుటితరత్నచ్ఛటావటువిభావ
మెటు మాసిపోవు నా ఘటనాఘటనపాట,వప్రశస్తరసానువర్ణనంబు
ఎటు వీడిపోవు నా చటులగాండీవస,ద్గుణముక్తశర వేగగుంఫనంబు
అంబుదశ్యామలాకారు సంశతోఁ బ్ర,చండగాంభీర్యరత్నాకరుండవై య
సాధ్యరిపుజయోత్సాహివై సత్కవిత్వ, పోషకుఁడవును నీ వౌట భూమిరమణ! ౪

కొలువై నప్పుడు సత్కవిత్వరచనాగోష్ఠిన్ మనం బుంచి వ
ర్తిలి తృప్తిం గనలేక లోకవిజయోత్సేకమ్మునన్ జైత్రయా
త్రలకున్ సైతము దోడురాఁ గవులదండన్ బాయగానోడు చే
తల నెన్నన్ రసికాగ్రగణ్యతయు కాదా! కృష్ణరాయాధిపా. ౫

కవులం బ్రోచితి వాశ్రితావళిని సత్కారంబు గావించి రా
ట్కవులంగా వెలయించినావు రిపుదోర్గర్వంబు మాయించినా
వవనీభారము బూనినావు దిశలన్ వ్యాపించె నీకీర్తి యా
రవిచంద్రప్రభ వెల్గు నెల్లపుడు ఆర్యా! కృష్ణరాయాధిపా! ౬

---

# బసవపురాణము : తత్కవి విశేషములు

శ్రీ శేషాద్రి రమణకవులు, శతావధానులు

ద్విపద కావ్యములు తెనుగునందు వెల యించిన వారిలో పాలకురికి సోమనాథ కవి ప్రథమగణ్యుఁడు. రసోద్రేకమునందును, రచ నాతిశయము నందును దేశి తెనుంగు పలుకుఁ బడులందును పాలకురికి సోమనాథుని కృతు లద్వితీయములు. ద్విపదరచనమునం దాతఁడు అందెవేసినచేయి. ద్విపదరచనమునందు ఆంధ్ర వాఙ్మయమునఁ బేరెన్నికగన్న గౌరనయుఁ దాళ్ళపాకవారును నీయన కనుయాయులె. ద్విపద బసవపురాణము ద్విపదపండితారాధ్య చరిత్రమును దేశోద్ధారకులు ప్రకటించి యాంధ్రవాఙ్మయమునకుఁ బరమోపకారము గావించిరి. బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారు వ్రాసినపీఠిక అతివిస్తరము,సుపరి శోధితము నయ్యును నందుఁ గొన్ని తావుల విమర్శనీయాంశములు గలవు. శ్రీయుతులు చిలుకూరి నారాయణరావుగారు కవినివాస ముచ్చరించుటలో భ్రమపడి కవిని శుద్ధకర్ణాట దేశమునందు విడిచిపెట్టిరి. ఈ విషయమునఁ బెక్కు విమర్శ వ్యాసములు విభూతి పత్రిక లోను ఇతర పత్రికలందును బఠించుచునే యుంటిమి. అందలి సందిగ్ధాంశముల నించుక చర్చించి సోమనాథుని జీవితచరిత్రమును దెలిసి కొనుటకే ప్రకృత వ్యాసరచనము. చర్చనీ యాంశము ద్విపదరూపముగఁ బ్రబంధ రూప ముగ నున్న బసవపురాణముల నుద్దేశించి వ్రాయఁబడినది గాన బసవపురాణమను శీర్షిక యుంచితిమి.

పాలకురికి సోమనాథకవి ఓరుగంటికి ముప్పఁ డామడల దూరమునందున్న పాలకురితియని జనవ్యవాదము రాష్ట్రమునం దంతటను రూఢమైయున్నది. తదాదిగ వీరశైవ భక్త గణమున కీ పాలకురితి క్షేత్రరాజముగా వెలయుచున్నది. పాలకురికి సోమనాథుని గ్రంథము లీ పాలకురికిలోఁగల యాలయము నందుఁ బఠింపఁబడుచున్నవి. ప్రతాపచరిత్ర మను వచనకావ్యమునందు సోమనాథుని నెలవు పాలకురికి యనియె కలదు. అన్యవాద కోలాహలమునందును బసవ పురాణ పద్య కావ్యమునందును బేర్కొనఁబడిన పాలకురికి సోమనాథకవి జన్మభూమి యనుటకు సంశయ ముండదుగాని మైసూరు రాజ్యములో హాల్కు రికిదే పాలకురికి యనియు, సోమనాథ కవి యచటివాఁడే యనియు నారాయణరావు గారి వాదము. ప్రభాకరశాస్త్రిగారు పాల కురికి యను గ్రామము సోమనాథుని నెలవని విశ్వసించిరి. ఈ గ్రామము ఓరుగల్లు మండల మునఁ గలదఁట యనిరి. ఆయన సిద్ధినొంది నది యితర గ్రంథాధారములచే రాద్ధాంత మగుచున్నదనిరి. పాలకురితిలో గుట్టపై సనోక సోమనాథాలయము గలదు. గ్రామమునం దొక సోమనాథాలయముగలదు. ఆలయము నందే మఠము గావించికొని సోమనాథ కవి నివసించెనని యచట జనుల యభిప్రాయము. అచటనే కొండక్రింది యాలయమునఁ గల యొక స్థలము జూపి యందు సిద్ధినొందినటుల

నచటి ప్రజలు విశ్వసించుచున్నారు. పద్య బసవ పురాణములోని కవి మలభంగ చంగ శివగంగకుఁ జెంగట కల్కెమ న్వర్తి'' అను పాఠమునుబట్టి సోమనాథుఁడు శివగంగా క్షేత్రము చెంతగల కలికె మను నగరమున సమాధిస్థితుఁ డయ్యెనని శాస్త్రిగారి యభిప్రాయము. శాస్త్రిగారు సోమనాథుఁడు పాలకురికి నివాసి యనియు ఆ గ్రామమున జనించుటచే సోమనాథుని కా యూరి లింగమూర్తి పేరే తలిదండ్రులు పెట్టి యుండవచ్చుననియు అచ్చటి సోమనాథుని పుట్టుకకు బూర్వమే వెలసి యుండవచ్చు ననియు సెలవిచ్చిరి. ఇందువలన సోమనాథుని నెలవు పాలకురితి యనుటలోను అది ఓరుగల్లు చెంత గలదనుటలోను శాస్త్రిగారు మనతో నేకీభవించుచున్నారు. గ్రంథస్థాధారములఁ బట్టి ప్రవాదముల దుర్బలవాదముగ గ్రహింతుమేని కలికెములో సోమనాథుఁడు సిద్ధి నొందిన యనంతరము జ్ఞాపకార్థముగ స్థానికులు పాలకురికిలో సమాధి కట్టియుందు రని విశ్వసింపవచ్చును.

నారాయణరావుగా రొక వాదము దెచ్చి పెట్టిరి. సోమనాథకవి నివాసస్థలము పాలకురికి గాని పాలకురితి గాదనియు ఓరుగల్లు చెంత నున్నది పాలకురితి గాన నది సోమనాథుని నెలవుగాదు. మైసూరు సీమలోని హాల్కురికియే సోమనాథుని నెలవని వారి సిద్ధాంతము. ఈ సిద్ధాంతమునకుఁ బ్రతిబంధకములు గొన్ని గలవు. సోమనాథుఁడు పాలకురికిలో నుండఁగా ఓరుగల్లులోని జంగములు ఆయనను గొని వచ్చినట్లును ఎద్దులబండిపై తత్క్షణమే ఓరుగంటికి వచ్చినట్లును స్థానిక చరిత్రమునందును పద్య బసవపురాణమునందుఁ గలదు. ఎటనో మైసూరు రాజ్యములోని హాల్కురికిలోనే యున్నచో నింత తొందరగా నీతని గొని వచ్చుట యసాధ్యము. అసంభవముగూడ.

సీ॥ భవదీయ సంబంధ బంధురం బయ్యె నే
భాగ్యంబు జేసెనో పాలకురికి
యుష్మద్విహార సంయుక్తమై మించె నే
భాగ్యంబు జేసెనో పాలకురికి
యుష్మదీయాశ్రమాభ్యున్నతి గాంచె నే
భాగ్యంబు జేసెనో పాలకురికి
భవదంఘ్రిపూజనావరుల కిమ్మయ్యె నే
భాగ్యంబు జేసెనో పాలకురికి
గీ॥ పాలకురికి యేమి భాగ్యంబు జేసెనో
నీ స్వనామపూర్వనిహితమయ్యె
ఈహితానుషంగ! యేకామ్రగురుచిత్త
నలినభృంగ! సోమనాథలింగ!

సోమనాథుని మతానుయాయులకు నెలవుగను సోమనాథుని విహారము గలదిగను సోమనాథుని యాశ్రమము గలదిగను సోమనాథుని భక్తులకు క్షేత్రముగను నున్నది ఓరుగల్లు చెంతగల పాలకురితియెగాని మైసూరు మండలములోని హాల్కురికిగాదు. నేటికిని సోమనాథకవి కీర్తిచిహ్నములు అశేష వీరశైవసేవనీయములై పాలకురితిలో నలరారుచున్నవి. కాని పాలకురికి వేఱు, పాలకురుతి వేఱు అని నారాయణరావుగారు వాదింతురు. సోమనాథునికి ముందును దరువాతను వ్యవహారమునందున్న పాలకురికి యను రూపము ప్రజావ్యవహారమున నేడు పాలకురితియై యుండును. హాలుకురికి యను గ్రామనామము సోమనాథుని గృహనామముగ వ్యాప్తి లేనపుడు, మచ్చునకేని యొక ప్రమాణమైన లేనపుడు సోమ

నాథునితో సంబంధ మట గోచరింపనపుడు పాల్కురికినే సోమనాథుని నెలవుగా విశ్వ సించుట యుక్తమని తోచదు. పాలకురికియే పాలకురికిగ విశ్వసించుచో నచట సోమనాథుని కీర్తిచిహ్నము లుండవలయును. సోమనాథు నితో సన్నిహితసంబంధముగల ఓరుగంటికిఁ జేరువగ నుండవలయును. అట్టి వేవియు లేక ఆంధ్రులగు కాకతి రాజులతో ఆంధ్రనగరము తో ఆంధ్రులగు శిష్యులతో నాంధ్రదేశ కవి తతో ఆంధ్రుఁడై కంభము మెట్టు చెంత గల కట్టకూరు వాసియగు పోతిదేవరతోఁ దెలుగు వాడని విశ్వసింపనగు పాలకురికి నూరన్నతో సంగనామాత్యునితో సంబంధముగల సోమ నాథుని నారాయణరావుగారివాదము ప్రమా ణముగఁ గైకొని మైసూరు మండలమునకుఁ ద్రోసివేయ మనస్సు అంగీకరింపకున్నది.

సోమనాథుఁడు కర్ణాటమునఁ గవిత రచిం చెఁ గానఁ గన్నడుఁడని రావుగారి వాదము. సోమనాథుఁడు మహారాష్ట్రమున, గన్నడ మున, ద్రవిడమున, నాంధ్రమున, సంస్కృత మున నపరిమిత పరిజ్ఞానముగలవాఁడు. మహా రాష్ట్ర, కన్నడ కవిత పండితారాధ్య చరి త్రము నందె గలదు. ద్రవిడకథల యథా మాతృకముగాఁ దెలిగించినాఁడు. ఆంధ్రమున నెక్కుడుకృతులు రచించినందునను ఆంధ్రజా తీయ పదములతోఁ గవిత యలరారి నందునను ఆంధ్రదేశవాసి యనుట కాధారములు పెక్కు లున్నందునను సోమనాథుని నాంధ్ర దేశవాసిగను ఆంధ్రునిగను విశ్వసించుట యుక్తము.

సోమనాథుఁడు ఓరుగంటి చెంతగల పాల కురికిలో నుండినట్లు బసవపురాణ పద్య కావ్య మునఁ గలదు. దాదాపుగా నది ఐదువందల సంవత్సరముల నాఁటిది. గ్రంథకర్తయగు పిడుపర్తి సోమనాథుఁడు పాలకురికి సోమనాథు నకు శిష్యప్రశిష్యప్రశిష్యుఁడు. అనఁగా ఐదవతరము వాఁడు. పిడుపర్తి సోమనాథుని మూలపురుషుఁడగు శివరాత్రి కొప్పయ్య పాలకురికి సోమనాథునివలన దీక్షగైకొనిన శిష్యుఁడు. అందుచేఁ బాలకురికి సోమనాథుని చరితము బాగుగాఁ దెలిసిన వాఁడనియే చెప్ప వచ్చును. శివరాత్రి కొప్పయ్యకు ఐదవతరము వాఁడు గానఁ బై కాల నిర్ణయము సరిపోవును. సోమనాథుఁడు పాలకురికినివాసిగాననే దోకి పర్తి శరణులు, గుంటూరు కొండవీడు శరణులు తఱచుగా ఓరుగంటిచేరువలో నున్న పాల కురికికిఁ బ్రయాణముజేసి స్మరణ చిహ్నము లను భక్తి ప్రపత్తులతో సేవించి జనప్రవాద ములు వంశపరంపరాకథనములు విని యుందురు. దోకిపర్తియుఁ బద్యబసవపురాణ నిర్మాతయగు సోమనాథుఁడును దద్వంశీయు లును నివసించిన పిడుపర్తియుఁ గొండవీటి సీమలోని గ్రామములు. పిడుపర్తి సోమనాథుడు పాలకురికి సోమనాథుని గూర్చి విస్తృతమగు వర్ణనము గావించినాఁడు. చూఁడుడు.

'శ్రీభసితత్రిపుండ్రక ప
రీతవిశంకట ఫాలు, జాట జూ
టీభరధారు నిర్మలన
టీపటలావృత దేహు నక్షమా
లాభరణాఖిలాంగు బస
వాక్షరపాద పవిత్రవక్త్రుఁ జి
చ్ఛోభితచిత్తుఁ బాల్కురికి
సోమయ దేశికుఁ బ్రస్తుతించెదన్"
—"పాల్కురికి నామపురీ వరసోమనాథుఁడు"

లిపి పఠింపకమున్న యపరిమితార్థోక్తి
　　శక్తి యాతనిజిహ్వ జరుగుచుండు
ఛందోధికరణాది సరణి చూడకమున్న
　　మది నుండు కావ్యనిర్మాణశక్తి
భాష్యసంగతులు చెప్పక చూడకయమున్న
　　రుద్రభాష్యక్రియారూఢి వెలయు
తర్కశాస్త్రాది విద్యలు పఠింపకమున్న
　　పరపక్షనిగ్రహప్రౌఢి వెలయు

నతని నుతియింప నాబోటి కలవియగునె
జైనమస్తక విన్యస్త శాతశూల
కలిత బిజ్జలతల గుండుగండ బిరుద
శోభితుఁడు పాల్కురికి సోమనాభిధుండు.

ఆతఁడు గురువరకర సం
జాతుండై విశ్వనాథుసన్నిధి కవితా
చాతురి మెఱింగి...

"వేగ పాల్కురికిపురీశ దేశికునకుఁ వినిపించి"
"భవిగాని వానితోఁడఁ
వివాద మొనరింపఁ జూడవిధిలేదు."

ఉదాహృత భాగములవలన పాలకురికి సోమనాథుఁడు, పాలకురికి నివాసి యనియుఁ బూర్వసుకృతవశమునఁ జదువకయే మహా విద్వాంసుఁడయ్యెననియు, జైనమస్తకవిన్యస్త శాతశూలబిరుదాంకుఁడనియు విశ్వనాథ కవి శిష్యుఁడనియుఁ దెలియుచున్నది. ఇందులూరి అన్నయామాత్యుని ప్రోత్సాహముచే పాల్కురికి సోమనాథుఁడు అఱువది ముగ్గురు శరణుల కొఱకు దోకిపర్తి అగ్రహారముగాఁ బడసి యందుఁ గొంతకాలము శిష్యులతో వసించెను. అనంతరము కన్నడ దేశమున కేగి యచ్చటి భక్తులచే సేవలు గొనుచు గొంత కాలము నివసించి వార్ధకమున శివగంగ చెంత గల కలికె మను పురిలో బయలయ్యెను. పిడుపర్తి సోమనాథుఁడు పాల్కురికి సోమన పాలకురికి నివాసియనియు ఓరుగంటికి మతాంతరుల జయింప నేగెననియు దోకిపర్తిలోఁ జాల కాలముండి వార్ధకమునఁ గన్నడదేశమున కేగె నని చెప్పుటచే మైసూరు మండలములోని హాల్కురికి యాతని నివాసమనుటకుఁ బ్రతిబంధకము. పిడుపర్తి సోమన వాక్యములు ప్రమాణములుగాఁ దీసికొనవచ్చును. కారణము పాలకురికి సోమనాథుఁడు తన కైదవ పురుషుని గురువు. పిడుపర్తిచెంత గల దోకిపర్తిలోఁ జిరకాలము నివసించినాఁడు. ఎన్ని విధములఁ జూచినను పాలకురికి యనబడు పాలకురితియందు నివసించినవాడనుట సమంజసము. పాలకురికియే క్రమముగా పాలకురితిగా మారియుండును. ఇప్పుడు గూడ జనసామాన్యము పాలకురికి పాలకురితి యని రెండురూపములతో వ్యవహరించుట నారాయణరావుగారు వినియున్నచో వారి విపరీత సిద్ధాంతము బయలువెడలకుండెడిదే.

పాలకురికి సోమనాథుని కాలమున ఓరుగల్లు రాజ్యము ప్రతాపరుద్రుని పరిపాలనమున నుండె ననియుఁ గొలఁది కాలములో నది యవనాక్రాంతము గాఁగలదని యాస్థలము విడచెననియుఁ బ్రతాపరుద్రుని మంత్రి యగు ఇందుటూరి అన్నయను ప్రోత్సహించి జంగములకొఱకు దోకిపర్తి అగ్రహారముగా నిప్పించె ననియు పిడుపర్తి సోమనాథుఁడు బసవపురాణ కృత్యాదిలోఁ జెప్పినాఁడు. ఇందులూరి యనుటకు ఇందుటూరి యనుట ముద్రణ ప్రమాదము. ఇందులూరి

అన్నమంత్రి రుద్రమదేవి కాలమునను బ్రతాపరుద్రునికాలమునను మహాప్రసిద్ధుఁడై యుండి కాకతీయ సామ్రాజ్యము నిలువఁబెట్టినవాఁడు. ఈతఁడు స్వతంత్రముగా దోకిపర్తి యగ్రహారముగాఁ బ్రతాపరుద్రునిచే నిప్పించెను. పాలకుఱికి సోమనాథుఁడు రుద్రదేవుని కాలమునందు క్రీ. శ ౧౧౩౨ మొదలు ౧౧౯౮ వఱకు రాజ్యము బాలించెను గాన నాకాలమునం దుండె ననుటయే ఇతరాధారములచే సమన్వయించినచో సమంజసముగా నుండునని తోఁచుచున్నది.

పాలకురికిసోమనాథుని వీరశైవకవులందఱు బహువిధముల స్తుతించిరి. ఆరాధ్య బ్రాహ్మణ కవులుగూడఁ బ్రశంసించిరి. ఈ సోమనాథుని పండితారాధ్యచరిత్రమునే శ్రీనాథ మహాకవి పద్యకావ్యముగా వ్రాసి ప్రగడయ్యకు అంకితము గావించెను ఆ పద్యకావ్య మిపుడు గోచరింపకుంట విచారకరము.

పిడుపర్తివారి వంశములోఁ బ్రసిద్ధులగు కవులు పలువురు కనిపించుచున్నారు. పద్య బసవపురాణమువలన గోచరించు నీ వంశజుల చరిత్రము దిఙ్మాత్రముగా నుదాహరించుచున్నారము.

పి డు ప ర్తి ని మ్మ య క వి

శ్రీ మన్మహాలింగ సేవానముద్భూత
పరమసుఖామృత వరపయోధి
కలిత చతుష్షష్టికాల శివార్చనా
మహనీయ నిష్ఠాసమన్వితుండు
భవపాశ వర్జన ప్రథిత సువ్రతసత్య
పావన చిత్స్ఫూర్తి భవ్యమూర్తి
శుద్ధాత్మ పిడుపర్తి సోమయ దేశిక
సత్పుత్రుఁ డష్టభాషావిదుండు
భవుల కెన్నఁడు గవిత చెప్పని ఘనుండు
కాంతు లుడిగిన సమలోష్టకాంచనుండు
శాంతిదాంతిమయస్వాంతసంయుతుండు
జగతి పెంపారు నిమ్మయాచార్యవరుఁడు.

బసవ పు. పద్యము.

ఈ నిమ్మయార్యుఁడు గొప్పకవిగఁ జెప్పఁబడ, నే గ్రంథములు పేర్కొనఁబడలేదు. భవులకుఁ గవిత చెప్పనివాఁడుగను అష్టభాషా విశారదుఁడుగను బేర్కొందెను. ఈ కవితండ్రి పెద్దసోమయ్య ప్రౌఢదేవరాయల సమకాలికుఁడుగనుండి అంకిలిపడి దోకిపర్తి యగ్రహారమును దిరుగఁ బ్రౌఢరాయలవలనఁ బడసెను. ప్రౌఢరాయలు క్రీ.శ. ౧౪౩౦ వఱకు రాజ్యము పాలించెఁ గాన నాకాలమున నున్న పెద్ద సోమయపుత్రుఁడగు నిమ్మయకవి క్రీ.శ. ౧౪౭౦ ప్రాంతములోఁ బ్రఖ్యాతుఁడు గవియునై యుండనోపును. నిమ్మయ కవి రచించిన గ్రంథములలో రెంటినామములు మాత్రము వినగలిగితిమి. ఆ గ్రంథములు మదరాసు ప్రాచ్యలిఖిత గ్రంథాలయములోఁ గలవు.

1. నిజలింగ చిక్కయ్యకథ
2. ఒడయనంబి చరిత్రము

పి డు ప ర్తి బ స వ న క వి

ఈయన నిమ్మనార్యునకుఁ బినతండ్రియగు దేవనార్యుని కుమారుఁడు. తల్లి మల్లమాంబ, ఈయన దీక్షాబోధ,పిల్లనైనారుకథ, బ్రహ్మోత్తర ఖండము లోనగు ద్విపద కావ్యములు పెక్కులు రచించినాఁడు. పాలకురికి సోమనాథుని కృతుల వెలయింప నవతరించిన ప్రత్యక్ష బసవేశుఁడని యీయన ప్రస్తుతి

గాంచినవాఁడు. ఈయన గ్రంథములలో దీక్షా. బోధ మాత్రము ముద్రితమైనది. ఈ కవి క్రీ॥ శ॥ ౧౬౦౦ ప్రాంతమునం దుండి యుండ వచ్చును. ఈయనకుమారుఁడే బసవపురాణము పద్యకావ్యముగా రచించిన సోమనాథకవి. సోమనాథకవియే పద్యబసవపురాణము రచించి నటుల ఆ గ్రంథమునందు గద్యమునందు స్పష్టముగాఁగలదు. కాని శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారు అది బసవకవికృత మనుచున్నారు. బహుశః వీ రిట్లు చెప్పుటకుఁ గారణము సోమన్న, బాలన్న, గురవన్న, బసవన్న అను వారిలోఁ దా నవరజుఁడ నని చెప్పుకొనుటయె కానోపు. అగ్రజు డగు సోమన్నయే సోమ నాథుఁడు. అతఁడే బసవపురాణము పద్య కావ్యముగఁ గూర్చినవాఁడు. గద్యము దాని కనుగుణముగ నున్నది. అవరజుఁడను పదము యతిస్థానమున నుంటచేతను సోదరులలోఁ జిన్నవాఁడు బసవనగాన నితఁడే పద్యకావ్య రచయిత యని శాస్త్రిగారి తలంపు. పద్య ములో సోమనాథుని ప్రసక్తి యుంటచే సోమ నాథుఁడే గ్రంథకర్తయని కవిచరిత్రకారులు తలంచిరి. మేమును నటులే తలంచు చున్నా రము. అగ్రజుఁ డను భావమున నవరజుఁడని ప్రమాదముగ సోమనాథుఁడు వ్రాసెనో లేక యీ పాఠమే దోషమో పరిశోధింప వలసి యున్నది.

పిడుపర్తి సోమనాథకవి

ఈయన తనతండ్రియగు బసవన్న ఆజ్ఞచే ద్విపద బసవపురాణమును బద్యకావ్యముగ ఏడాశ్వాసముల పరిమితిలో రచించెను.

క. ఆవేదార్థము ద్విపదలు
నీ విప్పుడు పద్యములుగ నిర్మించిన భ
క్తావలి మెచ్చుఁ శివకవు
లీ విధ మంగీకరింతు రిష్టము మాకుఁ.

అను పద్యమువలన ద్విపదబసవ. పురా ణమునే పద్యములలోనికి పిడుపర్తి సోమ నాథుఁడు మార్చెనని తెలియును. శివకవు లిటులే రచింతు రనుటచే పండితారాధ్యుల శివతత్త్వసారము యథావిధముగ ద్విపదలో బండితారాధ్య చరిత్రమున పాలకురికి సోమ నాథుడు రచించిన యంశము జ్ఞాపకమునకు వచ్చును.

పిడుపర్తిసోమనాథుఁడు క్రీ. శ. ౧౬౬౦ ప్రాంతముల వఱకు నుండియుండనోపు. ఈ వంశజులలోఁ బలువురు కవులు గలరు. వారి వివరములు బండారు తమ్మయ్యగారు పిడుపర్తి కవులు అను శీర్షికతో మున్నొక మాఱు వ్రాసియున్నారు. విశేషము లం దారయ నగును. పిడుపర్తిసోమనాథుఁడు తనకుఁ గల ప్రబంధరచనా శక్తి పాలకురికి సోమనాథుని యనుగ్రహముచే జనించిన దని చెప్పుకొని నాఁడు. ఈయన కవిత నిర్దుష్టముగా సరసముగా నుండును. పాలకురికివారిద్విపదనే పద్యముల లోనికిమార్చుటచే నీతనియెడ గల కల్పనాశక్తి వెల్లడి కాకున్నను ధోరణిబట్టి చూచినచోఁ బ్రౌఢకవి యనియే చెప్పవచ్చును. పిడుపర్తి వారి వంశజులలో నింకనెందఱో కవులు ఎన్నియో గ్రంథములు మాటువడియుండుట సంతాప కరము. వీరశైవ లీమతోద్ధారకుల

గ్రంథముల నుద్ధరించి మతమునకు భాషకు సహాయము జేయుదురు గాత. *

* పాల్కురికి సోమనాథుని కృతు లన్నియు సుపరిష్కృతముగా ప్రకటించుటకు మా శివధర్మగ్రంథమాల ద్వారా ప్రయత్నములు జరుగుచున్నవి. సోమనాథకవి నివాసము ఓరుగల్లు సమీపమందలి పాలకురికియే యని మిక్కిలి దృఢముగా సిద్ధాంతింపబడినది. అనేక వ్యాసములు విభూతిలో ప్రకటితములగుటను పాఠకులు ఎరింగియే యుందురు. 'ఉరుకురికి' 'ఎలకురికి' మున్నగు గ్రామనామములు ఓరుగల్లుకు చేరువగానే శిలాశాసములలో లభించినవి. కావునను పాలకుర్తి సోమనాథాలయము ఎదుటగల ధ్వజస్తంభము మీద పాలకురికి యని స్పష్టముగ వ్రాయబడి యుండుట వలనను ఇదియే సోమనాథుని జన్మనివాసములభూమి యని ఘంటాఘోషగ జెప్పవచ్చును. రెండు తాటాకు ప్రతులలో సోమనాథుని యింటిపేరు పాలకుర్తియనిగూడ వ్రాయబడి యున్నది. దీనితో "కురికి" యను రూపము ప్రాచీన కాలమున ఆంధ్రదేశమందును వ్యవహరింప బడెడిదనియును తరువాయి 'కుర్తి' గాను వ్రాయబడె ననియును తేలుచున్నది. తోంటదకవియొక్క కన్నడ సోమేశ్వర పురాణమునుబట్టి పిడుపర్తికవి "సోమనాథకవి కల్కెమను గ్రామమున లింగైక్య మొందె"నని వ్రాసినాడే కాని అది సరియైనదిగా గనుపడుట లేదు. మైసూరు రాజ్యమున నెక్కడను సోమనాథుని సమాధిజాడలు గానరావు. అట్టి పేరుగల గ్రామమైనను గురుతు జిక్కలేదు. తోంటదకవి "కల్లెయ" మని వ్రాయగా పిడుపర్తికవి 'కల్కె' మని తెలిపినాడు. ఈ కారణములను బట్టి అనేకములగు అనుమానములకు తావు గలదు: కురికియే కల్కెగా కల్యెగా తాటాకు ప్రతులనెత్తి వ్రాయువారిచేత వ్రాయబడెనా? ఇట్లు పెక్కుసంగతులు పరిశోధింప బడవలసి యున్నవి. ఇత్యాములకు ద్రవ్యము ప్రధాన సామగ్రిగా నున్నది. ఉదారచరితులగు మహానుభావులు దానమునకు సిద్ధమగుటయే తడవుగ శ్రీశేషాద్రిరమణ కవులవంటి పరిశోధకుల గ్రంథరత్నములు ప్రకాశము నందగలవు. — సంపాదకుడు.

## మా దాతలు

తూపురాణి (జి. అత్రాఫ్‌బల్దా) గ్రామనివాసులును సుప్రసిద్ధ వీరశైవప్రముఖులును అగు శ్రీబాజారు వీరన్న, విశ్వనాథము, శివయ్యగార్లు అను శ్రీమత్సోదరులు 'విభూతి'కి రాజపోషకులైయున్న సంగతి మాపాఠకులకు సుపరిచితము. వారి గృహమునందు ప్రతివత్సర పద్ధతి ననుసరించి ఇదే చిత్రభాను శ్రావణ బ॥ ౯ శుక్రవారమున మహాగణారాధనము మిక్కిలి వైభవముగా జరిగినది. పలుగ్రామములనుండి వందలకొలది మాహేశ్వరు లాగమించి యుండిరి. ఆ సందర్భమున మమ్ము ఉత్సవ పూర్వకముగా స్వాగతించి శివధర్మములను గూర్చి ఉపన్యాసము గావింపజేసి సభవారి యెదుట నూటపదారు రూపాయల విభూతి రాజపోషక బహుమానమును సమర్పించి తమ సహజమైన ఔదార్యమును వెల్లడించిరి. వీరు కేవల శ్రీమంతు లగుటయేకాక ఆయురారోగ్య విద్యాబుద్ధి సంతానములు గలిగి భక్తిశ్రద్ధాపూరితులై మహాదానపరులై కీర్తి నార్జించియున్నారు. వీరికి పరమేశ్వరు డింకను అధికమైన అభ్యుదయమును అనుగ్రహించుగాక!

దుగ్గిరాల (జి. గుంటూరు) నివాసులును ప్రసిద్ధవ్యాపారులును 'విభూతి' మహారాజపోషకులును అగు శ్రీ రాచంసెట్టి కోటివీరయ్య, కొలగాని నాగయ్యగార్లు తమ మహారాజపోషకత్వపు దానములో మొదటి పర్యాయముగా ఏబది రూప్యములను ఇచ్చినారు. తక్కినవిగూడ త్వరగా లభించునని భావించుచు వీరికి సదాభోగభాగ్యములను సదాశివు డనుగ్రహించు గాకయని కోరుచున్నాము. —సంపాదకుడు

# ఆంధ్రుడా!

శ్రీ కంబాళమఠం కోటిబసవలింగయ్యగారు

ఉ. వీరతచేత వన్నెగను వీరసతీతిలకంబు లున్న ఈ
భారతమాతృగర్భమున బాలుడవై జననంబు నందియున్
శూరత కగ్రజుండ విటు శుష్కత జొచ్చితివేల నీ మహా
ధీరత జూపి లోకమున దీర్ఘుడవై బెడగొందు మాంధ్రుడా!

ఉ. ఎక్కడి నిద్దురోయి వెలు గెల్లలువారె వియత్పథాన పెం
పెక్కను భాస్కరుండు జను లిద్ధర పుణ్యులువోలె సిద్ధులై
చక్కబడన్ దొడంగిరి విచార మదించుకరైన నీకు లే
దొక్కొ? ప్రపంచసౌఖ్యముల నొల్లవటోయి తెలుంగుబిడ్డడా!

ఉ. లెమ్మిక భాగ్యరేఖ నిను లేపుచు నున్నది వేళఁదొద్దియ
క్కమ్మడి కార్యదీక్ష కయి యోర్పు మరొక్కటి చాలు, లేదు క
ష్టమ్ము సుఖమ్ము లోకమున శాశ్వత మెద్దియుగాదు, నిష్కలం
కమ్మగు ధర్మసేవ త్రిజగమ్ముల రక్షణ మెంచిచూడగన్.

ఉ. ధర్మమయాత్మలాభములు దగ్ధములై చనుచుండ నెట్టి దు
ష్కర్మము చిత్తమందునను గల్గదె దారుణవహ్ని మాతృ భూ
వర్మ సురక్షణమ్మున కవారితభక్తి శిరమ్ము వంచి యే
మర్మము లేక సేవలిడి మంగళముల్ ఘొనరింపబూనవా?

# పుస్తకదాతలు

మా కార్యాలయమునకు గావలసిన కొన్ని శైవ గ్రంథములను ఈ క్రింది మహాశయులు మిక్కిలి యౌదార్యముతో అడిగిన దే తడవుగ ప్రదాన మొనర్చిరి. శ్రీయుతులు కొమరవెల్లి, ముసలయ్యగారు ౬ పుస్తకములను, శివ్వా కుమారయ్యగారు ౮ని, భూపతి సోమలింగముగారు ౫౨ని, ౩ పత్రికా సంపుటములను, రామిణి మల్లయ్యగారు ౧ని, వీరందరును వరంగల్లు నివాసులు. శివపూజా పరాయణులును నై యున్నారు. వీరికి పరమేశ్వరుడు శాశ్వతైశ్వర్యముల నొసంగుగాక!

సంపాదకుడు.

# ఇష్టలింగము - ఈశ్వరవిజ్ఞాన సర్వస్వము

శ్రీ జి. టి. అక్కలయ్య దీక్షితులుగారు.

శ్రీ పరమేశ్వర సృష్టిలో పారమార్థిక జ్ఞానమునకు నిలయమని పాశ్చాత్యులచే బొగడ్తగనిన భరతఖండమునందు ప్రసిద్ధి వహించిన మతములలో అద్వైత శుద్ధాద్వైత కేవలాద్వైత శివాద్వైత శక్తివిశిష్టాద్వైత ములలో, శక్తి విశిష్టాద్వైత సిద్ధాంతములు గలిగిన వీరశైవమతము స్వాతంత్ర్య భావములచే లింగధారణాది ప్రత్యేకలక్షణములు గలిగి వేదాగమోపనిషత్పురాణేతిహాసములచే ప్రతిపాదింపబడి యున్నది. ఈ మతమునకు ముఖ్యవిధి యిష్టలింగధారణ. ఇష్టలింగ ధారణవలన మానవుడు తన్ను దానెఱింగి అనంతమైన ఈశ్వరజ్ఞానమును బొందగలుగుచున్నాడు. తదితర మార్గములచే బొందజాలనట్టియు "శివోహం, తత్త్వమసి" మొదలగు మహావాక్యములచే గల్గు నద్దానికన్న నుత్కృష్టమైన పారమార్థిక జ్ఞానమును బొందుచున్నాడు. ఇష్టలింగ ధారణచే విజ్ఞానము గలుగు మార్గము, విశేషగ్రంథ పరిశోధన వల్లను శివాచార్యుల శివదీక్షా సంస్కారము చేతను శివయోగానుభవము గల షట్స్థలజ్ఞానవంతుల అనుగ్రహముతో తాను ఎఱుంగవలసి యున్నది. ఇట్టి మహోత్కృష్ట విషయములను దెలుపబూనినపుడు స్వకల్పితము లని భ్రమ పడకుండుట కొఱకు శాస్త్రప్రమాణములు చూపకతప్పదు. పండితులు సమ్మతించినను నవనాగరికులకు వినుగుగల్గుట సహజము గనుక ఎక్కువ ప్రమాణములు చూపక సాధ్యమైనంత సంక్షిప్తముగా చూపబడును. పండితులు మన్నింతురుగాక.

ఇష్టలింగమువలన ఈశ్వరజ్ఞానము గల్గుటకు లింగశబ్దము, నిర్మాణము, పరిమాణము, బాహ్యాంతర రూపము, లింగమునందలి పంచసూత్రముల వివరణము, అష్టబంధనము (కాంతి) వివిధశుద్ధులు, లింగసంస్కారము, పది అధివాసములు, నానావిధ అభిషేకములు, ధారణలు, షడధ్వశోధన, అంగకరన్యాసములు ప్రాణప్రతిష్ఠ, ధరించెడివాని చిత్కళావాహన, దేహమున నిర్ణీతస్థానములందు ధరించుట, కరపంకజమున నుంచి పూజించుట, పదార్థనివేదన, తీర్థప్రసాద సేవన, లక్ష్యముంచి నిరీక్షించుట, లింగాంగసంబంధము, ఇవ్విధమైన చర్యలకు గల కారణము, సంపూర్ణముగా నెఱుంగవలయును. ఇట్లెఱుంగుటకు గ్రంథము లున్నను తద్గ్రంథములు సంస్కృత భాషామయములై యుండుటచే సర్వులకు సులభసాధ్యములుగావు. మరియు విశేషగ్రంథపరిచయము, విమర్శనాజ్ఞానము అవసరము. అట్టి శ్రద్ధ వీరశైవు లందరియందు గల్గుటయు అసంభవ మగుటచే ఇష్టలింగమువలన ఈశ్వరజ్ఞాన మెటుల గల్గు ననుశంకకు కొందరు గురి యగుచున్నారు. అట్టి సంశయములు గొంతవరకైనను దొలగింప చేయుగల్గునని ఈ వ్యాసము సంక్షిప్తముగా వ్రాయబడుచున్నది.

### లింగ శబ్దము

లింగము అనగా ఎఱుంగ జేయునది (గుఱుతు) అని అర్థము. "లింగ్యతే జ్ఞాయతే అనేనేతి లింగం" అని నిర్వచింపబడినది. లింగము లను పేర వ్యవహరింపు చుండునవి అనేకములు గలవు పరివేశించుట, వెలువడుట దెల్పుచుండుటచే ఆకాశము లింగము, శీఘ్ర విలంబముల నెఱింగించుటచే కాలము లింగము, పూర్వాది దిక్కులను దెలుపుటచే దిశలు లింగములు, సుఖదుఃఖములను దెలుపుటవలన ఆత్మ లింగము. న్యాయ వైశేషిక సూత్రముల యందు "నిష్క్రమణప్రవేశన మిత్యాకాశలింగమ్—కాలలింగాని—దిశ్యం లింగమ్—సుఖదుఃఖ జ్ఞానానాత్మనో లింగమితి" అని చెప్పబడి యున్నది. వర్ణముల (అక్షరముల)కు లింగము అను పేరుగల్గి యున్నదని వాతూలాగమమున "వర్ణబీజం తథార్ణంచ లింగమక్షర మాతృకాః"అని చెప్పబడియున్నది. సృష్టిసంహారముల నెఱింగింపుటచే ఈశ్వరునకును లింగము అని చెప్పబడినది. "లయ గత్యూర్ధ్వయోగాశ్చైతుః లింగశబ్దః" యజుర్వేదమున "ఊర్ధ్వలింగాయనమః, ఇవ్విధముగ లింగశబ్దముచే వ్యవహరింపబడు చుండునవి అనేకములు గలవు.

### ఇష్టలింగము

సర్వవిధ చిహ్నములకు లింగములు అని చెప్పబడుచున్నటులె ఈశ్వరచిహ్నమునకును లింగము "లింగం తద్చ్ఛ్రిహ్నసంజ్ఞికం" అని చెప్పబడినది. ఇట్టి శివలింగములు స్థావరములనియు, చలములనియు, స్వయంభువులనియు, బాణలింగము లనియు, ఆర్ష లింగము లనియు, పార్థివలింగములనియు, క్షణికలింగములనియు, ఇష్టలింగములనియు, పెక్కు విధములుగా నున్నవి "లింగంత్వనేకవిధమస్తి వా" అని ధర్మశిరోమణి మొదలగు వానియందు జెప్పబడియున్నది. పలువిధ లింగములు ఈశ్వరచిహ్నములేయని చెప్పినను ఏక దేశత్వము, అస్థిరత్వము మొదలగు న్యూనతలు గలిగి యుండుటచే ఈశ్వర విజ్ఞాన సర్వస్వమును బోధింపజాలవు. ఇష్టలింగము (వీరశైవులు దేహమున ధరించు లింగము) అటులగాక ఈశ్వర విజ్ఞాన సర్వస్వమును బోధించును. "జ్ఞానార్థదర్శనాత్ తథా నిరూప్యతే సద్భిర్లింగం చిన్మాత్రరూపతః." శంకరసంహిత.

అదృశ్య పదార్థజ్ఞానము గలుగుటకును, అపారమై యుండు వాటిని దెలిసికొనుటకును, దృష్టికి అసాధ్యమైన లక్ష్యముల నెఱుంగుటకును లింగము (గుఱుతు) దప్ప వేరు సాధనమే లేదు. ప్రపంచ మెఱుంగని బాలవిద్యార్థికి శుష్కమైన చిత్రపటము (భూగోళపటము) నందుగల నీలపురంగును చూచి నీరధు (సముద్రములు) లున్నవనుజ్ఞాన మెటుగల్గె? చిత్రపటమునందలి ఒంటి జంట చుక్కల వరుసను చూచి కాలిదారి ఇనుపదారి శకటమార్గములని యెటు లెఱింగె? రేఖా సంయోగ చిత్రితముల జూచి ఖగోళము నందలి గ్రహయోగపాతము లెవ్విధి దెలిసికొనియె? సరళ కోణ రేఖల కూడిక చూచి క్షేత్రరూప జ్ఞాన మెటులగలిగె? చిత్రపటముల జూచి భూఖండ నదీనదము లెట్లు గ్రహించె? వీనికి ప్రత్యుత్తరము లింగము (గుఱుతు) అని చెప్పక తప్పదు. అటులనే ప్రతిపరోక్ష పదార్థజ్ఞానము గల్గుటకును లింగము ముఖ్యావసరమైయున్నది. అతీంద్రియ అనిర్వచనీయమైన ఈశ్వరజ్ఞానము

గల్గుటకు లింగము ముఖ్యముగా నుండవలయును. అట్టి ఈశ్వర జ్ఞానార్జనకై నిర్ణయించి ధరించుటకు ఇచ్ఛగించిన గుఱుతునకే ఇష్టలింగమని పేరు. "ఇచ్ఛతీతి ఇచ్ఛాచ ఇష్టిః— లింగ్య తేః-జ్ఞాయతే అనే నేతిలింగం"— అని నిర్వచింపబడినది. ఇష్టలింగముచే ఈశ్వర విజ్ఞాన మెటుల గల్గు? జడమైన ఇష్టలింగము చైతన్యుడగు ఈశ్వరుని నెఱింగింపగలదా? ఇష్టలింగమునకును ఈశ్వరునికిని సంబంధమేమి? మొదలగు ప్రశ్న లుత్పన్నముకాగలవు. అనిర్వచనీయమైన (జెప్పసాధ్యముకాని) ఈశ్వరుని ప్రణవాది శబ్దములచే దెలిసికొను విధమునను, బరమైన దారు, శిలా ప్రతిమలచే జీవముగల జంతువుల రూపపరిజ్ఞానము గనుగొనునట్లును, సంబంధరహితమైన చంద్రబింబమును ముకురంబున గాంచునట్లును ఇష్టలింగముచే ఈశ్వరీయమైన విజ్ఞానసర్వస్వము దెలుసుకొనబడుచున్నది.

## నామము

ఈశ్వరుడు సామాన్యముగ నామరూపరహితుడనుట సత్యము. అట్టి ఈశ్వరుని దెలిసికొనుటకై ఈశ్వరసృష్టియందలి శబ్దముల ఆధారముచే ఈశ్వరునికి నామరూపములు గల్పింపబడియున్నవి. ఈశ్వర నామరూపములు పలువిధములుగ గల్పించియున్నను వేదాగమోపనిషత్పురాణేతిహాసముల యందు సూత్రభాష్యములందు నొకటిగా జెప్పబడి సర్వహైందవ మతములవారిచే సమ్మతిబడసి సిర్వివాదమైన ఈశ్వరనామము ప్రణవము. ప్రణవశబ్దము తాలదంత్య ఓష్ఠ నాసిక కంఠాదులయందు బుట్టక మానవహృదయము (గుండె)నందు అప్రయత్నమున బుట్టుచున్నది. మానవునిలో ఈశ్వరుడు విశేషముగ వ్యాపించియుండు హృదయమున బుట్టు హృన్నాదమె ఓం అనుశబ్దము. ఈ శబ్దమునకే ప్రణవము అని పేరు. ఈ ప్రణవశబ్దమె ఈశ్వరనామము. ఇట్టిదగుటవల్లనె అత్యంత విరుద్ధభావములుగల్గియుండునట్టి పరిపరిమతములవారెల్లరును ఒక్క ఓంకారమును ఈశ్వరనామముగా అంగీకరింపుచున్నారు. వేదాగమోపనిషత్తులును ఓంకారమును ఈశ్వరనామముగ అంగీకరింపుచున్నవి. యజుర్వేదం ఓం ఖం బ్రహ్మ — "యోగజాగమం" ప్రణవోపిపరబ్రహ్మ— "ఛాందోగ్యోపనిషద్" ఓమిత్యేతదక్షర ముపాసీత— "భగవద్గీత" ఓమిత్యేకాక్షరం బ్రహ్మ.

## రూపము

ఇటుల సర్వమత సమ్మతమైన ప్రణవ నాదోత్పత్తి గలుగుచుండు మానవ హృదయమునందు తార, దండ, కుండలి, అర్ధచంద్ర, బిందు,- ఆకృతులు ముఖ్యమై యున్నవి. ఆధునిక పరిజ్ఞానముచే ఆంగ్లేయులచే రచింపబడిన ఫిజియాలజి అను శారీరక శాస్త్రములయందు హార్టు (హృదయము) సెమీలూనార్ వాల్వ్సు (అర్ధ చంద్ర సిధానములు) మొదలగు ఆకృతులు గలవని నిరూపింపబడియున్నది. అట్టి హృదయాంతర్గత అర్ధచంద్రాది రూపములచే ఓంకార శబ్దమునకై అక్షరములుగా వ్రాయుటకు పూర్వము నిర్మింపబడిన రూపమె ఇష్టలింగము. శబ్దములను లిపి (అక్షరములు లేక వ్రాత)గా వ్రాయుటకు పూర్వము బొమ్మలవలె (ఆకారములు గలవిగా) నిర్మింపుచుండిరి. క్రమశః లిపిగా వ్రాయబడినవి. ఈ విషయములు అక్షరోత్పత్తిని గురించి వ్రాయబడిన గ్రంథములయందును ప్రాచీన చరిత్రలు

౩౪ వ పుటయందును ఆంధ్రవిజ్ఞానసర్వస్వము ప్రథమ సంపుటము ౧౯ ౩౮ పుటయందును గొంత వ్రాయబడినది. అటుల బొమ్మవలె ఆకారము గలదిగా వస్తువులచే నిర్మించిన ప్రణవరూపమె ఇష్టలింగము. వీరశైవ ధర్మ శిరోమణి ఓమితి బ్రహ్మ పరమం లింగాకారం" ఇష్టలింగ నిర్మాణమునందలి ఆకృతులు మానవ హృదయమునగల అర్ధచంద్రాది రూపముల ఆకృతులె. ఈ ఆకృతులకు ఇష్టలింగమున అధఃపీఠము, ఊర్ధ్వపీఠము, మధ్యము, గోముఖము, గోళకములని పేర్కొన బడు చున్నవి. వీటికి పంచసూత్రములని పర్యాయ వాచకము. "సూచనాత్పరమేశస్య" ఈశ్వరుని సూచింపుటచే సూత్రములని నిర్వచింపబడినది. ఈ పంచసూత్రములు మానవహృదయమున గల అర్ధ చంద్రాది రూపముల ఆకృతులె. ప్రణవమును ఆకారముగ నిర్మించిన ఇష్ట లింగమునందలి ఈ ఆకృతులనే ప్రణవము లిపి (వ్రాత)గా వ్రాయబడినప్పుడు, ఈ తార దండకుండలి అర్ధచంద్ర బిందువులను, సుప్త భుజంగ రూపముగాను వ్రాయబడినది. అట్టి ఆకారము నాగరలిపియందు వ్రాయబడు ॐ ఓం అను అక్షరమై యున్నది. కామికాగమం- 'ప్రథమం తారకారూపం ద్వితీయం దండ ఉచ్యతే, తృతీయం కుండలాకారం చతుర్థం చార్ధచంద్రకం, పంచమం బిందుసంయుక్తం ప్రణవం"— యోగజాగమం "నాదాత్మకం సుప్తభుజంగరూపం త్రితత్త్వమూలం ప్రణవం నమామి—

పరిమాణము

మానవహృదయమునుబట్టి నిర్మించిన ప్రణవరూపమగు ఇష్టలింగముయొక్క పరిమాణముగూడ హృదయము ననుసరించియె నిర్మింపబడియున్నది. ఈశ్వరుడు సర్వత్ర వ్యాపించియున్నను మానవుని హృదయమున విశేషవ్యాప్తి గల్గియున్నాడని ఉపనిషత్తుల యందును గీతాశాస్త్రములయందు పరమార్థ ప్రబోధితములగు గ్రంథము లన్నిటియందును జెప్పబడినది. మానవ హృదయమున అంగుష్ఠ ప్రమాణముగల ఆకాశముగలదు. అనగా మిగత భాగమంతయు మాంసరుధిరనాడులచే నిండియుండి అంగుష్ఠ (బొటనవ్రేలు) ప్రమా ణము రిక్తముగా నున్నది. అదియే దహరా కాశము, హృదయాకాశము, చిదాకాశము అని చెప్పబడుచున్నది. అట్టి హృదయాకాశ మున ఈశ్వరుడు వ్యాపించి యుండుటవలన ఈశ్వరవ్యాప్తమైన హృదయాకాశ పరిమాణ మును ఈశ్వరాకార పరిమాణముగ భావింప బడినది. అట్టి అంగుష్ఠ పరిమాణమును ప్రమా ణముగ నెంచి ఇష్టలింగ పరిమాణము నిర్మింప బడియున్నది. శంకరసంహిత - 'పరాహృదబ్జే, జ్వలంతి మంగుష్ఠమితం పురాణం లింగస్వరూ పం' కఠవల్లి అంగుష్ఠమాత్రః పురుషో మధ్యే ఆత్మనితిష్ఠతి-బ్రహ్మతర్కస్తవము. అపరిచ్ఛిన్న స్యాపి పరమేశ్వరస్యాంగుష్ఠ మాత్రత్వం హృదయకమలావచ్ఛిన్నత్వేన లింగరూప తయా హ్యుపపద్యతే.

పంచరత్నస్తుతి- మనుష్య హృదయాబ్జ కోశానా మంగుష్ఠ పరిమాణత్వాత్ తదంతర వకాశావచ్ఛిన్నత్వే నాంగుష్ఠపరిమాణత్వో క్తిః-మొదలగు ప్రమాణములచే హృదయా కాశపరిమాణము దెలుపబడియున్నది.

మంత్రము

మానవ హృదయమున అర్ధచంద్రాది

పంచరూపము లనియు ఇష్టలింగమున పీఠాది పంచసూత్రిము లనియు ప్రణవ (ఓంకార) లిపియందు తారాది పంచవర్ణములనియు జెప్పబడు ఈ పంచకమే న, మః, శి, వా, య, అను పంచాక్షరీమంత్రిమైయున్నది. ఈ పంచాకృతులలో తార-న,దండము-మ,కుండలి శి, అర్ధచంద్రిము వా, బిందువు య, అయి దును గలసినరూపము ౘ౦ నాగరలిపియందలి ఓం యొక్క రూపమైయున్నది. ఈ పంచాక్షరములు మానవహృదయమునందు గల్గి యుండు ఆకృతులే. ఒకశీర్షికయందలి విష యములను వివరించి వ్రాయునప్పుడు అందలి భాగములను దెల్పుటకై ఆంగ్లమున ఏ. బి. సి. డి. అనియు ఆంధ్రిమున అ, క, గ, చ, యనియు సాంకేతికాక్షరములుంచినట్లు ఈశ్వర విజ్ఞాన సర్వస్వములో ప్రతి శీర్షికయందలి విషయవివరములను ప్రణవ రూపముగు ఈ పంచాక్షరములు దెల్పుచుండును. చూడుడు- ఈశ్వరవిజ్ఞాన సర్వస్వములో పంచభూతములు అనునది యొక శీర్షికగా నుండినయెడల న పృథ్విని, మ జలమును, శి అగ్నిని, వ వాయు వును, య ఆకాశమును దెల్పుచుండునుగనుక మనకు బోధపడుటకై ఈ పంచాక్షరములను సాంకేతికాక్షరము లనుకొనవచ్చును. కామి కాగమము-న కార స్తారకారూపం మకారో దంఠ ఉచ్యతే, శికారః కుండలాకారో వాకార శ్చార్ధిచంద్రికం। యకారో బిందురూపంచ ఓం కారం పంచవర్ణకం॥ వాతులాగమం॥ మంత్రి మయం లింగం-పారమేశ్వరాగమం॥ యస్యాం నమశ్శివాయేతి మంత్రోయం హృది సంస్థితం- వీరశైవాచార ప్రదీపిక- లింగమంత్రిద్వయో రైక్యం ఇష్టలింగంతు శాంకరి॥

## ఏ క త్వ ము

హృదయమునందును, ఇష్ట లింగమునం దును, ప్రణవాక్షరమునందును, పంచాక్షరీ మంత్రమునందును పంచాకృతులకూడిన రూప ములు వేరువేరుగానున్నను తార (గుండ్రన) దండము (నిడుపు) కుండలి (అసమమైన వంపు) అర్ధచంద్రము (వంక) బిందువు (నీటిబొట్టు రూపమే) అను పంచాకృతులె హృదయము నకు, ఇష్టలింగమునకు, ప్రణవమునకు, పంచా క్షరీ మంత్రమునకు మూలమై యున్నవి గాన హృదయాంతర్వర్తియగు అంగుష్ఠ మాత్రి పురుషు డన్నను, ఇష్టలింగ మన్నను, ప్రణవ మన్నను, పంచాక్షరీమంత్ర మనినను ఆకార భేదముగల యొకవస్తువునే చూపుచున్నందున నొక్క ఈశ్వరచిహ్నములే అయియున్నవి. ఈశ్వరునకు విశేష వ్యాప్యస్థానము హృద యము, రూపము ఇష్టలింగము, నామము ప్రణవము,బోధించునది పంచాక్షరీమంత్రము, ఇందుచే గల్గుజ్ఞానము ఈశ్వరీయము, జ్ఞేయము ఈశ్వరుడు, జ్ఞాత ఇష్టలింగధారి (వీరశైవుడు) ఇట్టి చిహ్నమే ఇష్టలింగము.

## వి జ్ఞా న స ర్వ స్వ ము

బ్రహ్మాండము: గొప్పదగు అండాకార ములో సర్వభువనములు గలిగియున్న వసుటయె బ్రహ్మాండమని పేరు. ఇష్టలింగముయొక్క అధోభాగమె పృథ్వియనియు ఊర్ధ్వభాగమె ఆకాశమనియు పృథ్విపై ఆకాశము ఆవరించు టచే యేర్పడిన అండాకారమె బ్రహ్మాండ మనుటయు తాను తన దృశ్యాదృశ్య పదార్థము లెల్లను అందేబుట్టి అందే వసించి దానియందే లయించుచునను బ్రహ్మాండ పరిజ్ఞానము గల్గుట

వలన బోధించుటకును అభ్యసించుటకును ముఖ్యాధారము ఇష్టలింగము.

సృష్టి: చిత్రకారుడు సరళ, కోణ, వృత్త, బిందు మొదలగు రేఖల (గీతల) చే సృష్టిలో గల దృశ్యపదార్థములన్నిటిని చిత్రించి అందు జ్ఞానము గలుగజేయునటుల ఇష్టలింగమునందు గల పంచసూత్రముల ఆకారములగు తార, దండ, కుండలి, అర్ధచంద్ర, బిందు ఆకృతులచే ఈశ్వరసృష్టిలోగల సర్వస్వమును మనమున భావించి చిత్రించిదర్శింపజేసి బోధించుటకును అభ్యసించుటకును ముఖ్యాధారము ఇష్టలింగము.

పిండాండము:- మాతృగర్భమున అండాకారముగల్గి మావిచే ఆవృతమైన పిండము ఇష్టలింగాకృతిని గల్గియుండును. తద్రూపము 1919 సంవత్సరమున ప్రకటింపబడియుండు ఆంగ్లేయ వైద్య చింతామణియందు జూచిన సంశయము దొలంగును. అట్టి పిండమునందు ఇష్టలింగముయొక్క పీఠమువలె పాదజానువులును, మధ్యమమురీతి నాభి ప్రదేశమును, వర్తులమువలె హృదయమును, గోముఖమావమున కంఠము, గోళకమువలె శిరస్సు గలిగియుండును గనుక పిండాండ జ్ఞానము గల్గి బోధించుటకును అభ్యసించుటకు ముఖ్యాధారము ఇష్టలింగము—"పీఠమాపాద జాన్వంత మానాభి ర్మధ్యమీరితం, హృదయాంతం వర్తులంస్యాత్ కంఠాంతం గోముఖం భవేత్, భ్రూమధ్యాంతం లింగకంఠో మస్తకో లింగమస్తకం.

నిరాకారం: ఇష్టలింగ నిర్మాణ మెటింగియుండుటచే అందలి పంచసూత్రములు ప్రణవము చేతను పంచాక్షరీ మంత్రముతోడను బోధింపబడు నిరాకారుడగు ఈశ్వరుని దెలిసికొనుటకై ఈశ్వర విశేషవ్యాప్తిగల హృదయము నందలి తారాది ఆకృతులచే నిర్మించిన దని తెలియుటవలన ఈశ్వరుడు నిరాకారుడను జ్ఞానముగల్గి అభ్యసించుటకును బోధించుటకును ముఖ్యాధారము ఇష్టలింగము.

ఏకత్వము: సృష్టియందలి జీవకోటులన్నిటియందును ఈశ్వరు డున్నందున అనేక ఈశ్వరులు గలరను భావము గల్గుచుండును. అట్టి భావమును బోద్రోలి ఒక్క ఈశ్వరుడే గలడను భావము ఇష్టలింగము గల్గించును. ఎట్లన ప్రతియొక వీరశైవుడు ప్రత్యేక ప్రత్యేకముగ ఇష్టలింగములను ధరింపుచుండుటచే అనేకత్వము అగపడు చుండినను వీరశైవులు ధరించు ఇష్టలింగము లన్నియు నొక ఈశ్వర చిహ్నములని యెఱుంగ బడియుండుటచే జీవకోటు లన్నిటియందును ప్రకాశింపుచుండు ఈశ్వరచైతన్య మొక్కటియే యని తలంచెడి జ్ఞానముగల్గి బోధించుటకు అభ్యసించుటకు ముఖ్యాధారము ఇష్టలింగము.

సాకారము: నిరాకారుడగు ఈశ్వరుడు సృష్టి, స్థితి, లయ, తిరోధాన, అనుగ్రహము అనెడిపంచకృత్యములను పరా, ఆది, ఇచ్ఛ, జ్ఞాన, క్రియ, అనుపంచ శక్తులతో జరుపుచుండుటవలన అట్టి శక్తులతో గూడియుండుటచే గల్గినపంచసాదాఖ్యలలోన,కర్మసాదాఖ్యమును, మ-కర్తృసాదాఖ్యమును, శి-మూర్తి సాదాఖ్యమును-వ - అమూర్తిసాదాఖ్యమును, య-శివసాదాఖ్యమును, ఓం-నిరాకారనిరంజనుడగు ఈశ్వరునిదెల్పుచుండుటచే సాకారజ్ఞానము గల్గి బోధించుటకును అభ్యసించుటకును ముఖ్యాధారము ఇష్టలింగము - పారమేశ్వరాగమము

"యకార శ్శివపాదాఖ్యం వకార స్స్యాదమూర్తకం। శికారో మూర్తి పాదాఖ్యం మకారః కర్తునామకం।నకారః కర్మపాదాఖ్యం ప్రణవో మహానుచ్యతే—

పంచమూర్తులు, సాకారభావముచే పంచ మూర్తులని తలంచెడి వారిలో న - బ్రహ్మను మ - విష్ణువును, శి - రుద్రుని, వ - ఈశానుని, య - సదాశివుని, ఓం - పరశివు (నిరాకారు)ని దెల్పుచుండుటచే పంచమూర్తుల జ్ఞానము గల్గి బోధించుటకు అభ్యసించుటకు ముఖ్యాధారము ఇష్టలింగము: పారమేశ్వరాగమము 'ఓంకారస్స్యాత్పరశివోయ కారస్తు సదాశివః, ఈశ్వరోయంవకారశ్చ శికారో రుద్రఉచ్యతే మకారో విష్ణు రేవస్యాత్ బ్రహ్మ నార్ణ ఇతి క్రమాత్''—

విద్య: విద్యకు మూలములైన వేదవేదాంతాదులలో న - ఋగ్వేదమును, మ - యజుర్వేదమును, శి- సామవేదమును, వ-అథర్వవేదమును, య - వేదాంత సహస్రమును, ఓం - జ్ఞానమును దెల్పుచుండుటచే వేదాది విద్యాజ్ఞానముగలిగి బోధించుటకును అభ్యసించుటకు ముఖ్యాధారము ఇష్టలింగము.

తత్త్వములు: లింగాంగసంయోగము (శివయోగము)నందు చెప్పబడియుండు శివ, శక్తి, సదాశివ, ఈశ్వర, శుద్ధవిద్యా, మాయ, కల, విద్య, రాగ, కాల, నియతి, పురుష, ప్రకృతి, అహంకార, బుద్ధి, మనః, శ్రోత్ర, త్వక్, చక్షుః,జిహ్వా,ఘ్రాణ, వాక్, పాణి,పాద,పాయు, ఉపస్థ, శబ్ద, స్పర్శ, రూప, రస,గంధ, ఆకాశ, వాయు, వహ్ని, జల, పృథ్వి - అనబడు 36 తత్త్వముల జ్ఞానముగలిగి బోధించుటకును అభ్యసించుటకుముఖ్యాధారము ఇష్టలింగము.

యోగజాగమం "పంచభూతాని సర్వాణి... ......బోధ్యాని పంచభి ర్వర్ణైః పంచాక్షర మహామనోః''.—

షడధ్వములు: వటువునకు దీక్షాసంస్కార సమయమున (లింగధారణచేయుసమయమున) ఇష్టలింగమునందు షడధ్వశోధన చేయబడుటచే అనగా ఇష్టలింగముయొక్క పంచసూత్రములయందును తదుపరి భాగమునను అనాశ్రిత భువనము మొదలు కాలాగ్ని రుద్ర భువనాంతమగు 224 భువనములను, వ్యోమవ్యాపి మొదలగు 81 పదములను, అకారాది 51 వర్ణములను, శాంత్యతీతాది 5 కళలను, శివతత్త్వాది 36 తత్త్వములను, సద్యోజాతాది" 11 మంత్రములను న్యాసముచేయుట(ఆయాస్థానములందు జూపుట)వలన ఆయాస్థానములందు లక్ష్య ముంచినప్పుడు ఆయా అధ్వమును సంపూర్ణలక్ష్యమున భువన, పద, వర్ణ, కలా, తత్త్వ మంత్రములగు షడధ్వముల జ్ఞానము గలిగి బోధించుటకు అభ్యసించుటకు ముఖ్యాధారము ఇష్టలింగము.

లింగాంగ సామరస్యము: ఏకోత్తర శత సంఖ్యచే ప్రకాశింపుచుండు భక్త, మాహేశ, ప్రసాది, ప్రాణలింగి, శరణ, ఐక్యము లనెడి షడంగస్థలములను, ఆచార, గురు, శివ, చర, ప్రసాద మహాలింగములగు షడ్లింగములను, నాసిక, జిహ్వా, నేత్ర, త్వక్, శ్రోత్ర, హృదయములను షణ్ముఖములను; చిత్త, బుద్ధి, అహంకార, మనః, జ్ఞాన, భావములను షడ్హస్తములను; శ్రద్ధా, నైష్ఠిక, అవధాన, అనుభవ, ఆనంద, సమరస, అనబడు షడ్భక్తులను; క్రియ, జ్ఞాన, ఇచ్ఛ, ఆది, పర, చిచ్ఛక్తులను నట్టి షట్శక్తులను ధ్యేయ, రస్య,

ద్రష్టవ్యాసప్రశ్యో,శబ్ద, స్మర్తవ్యములను షడక్ష ణాలను, గంధ, రస, రూప, స్పర్శ శబ్ద, పరి ణామములనెడి షట్ప్రసాదములను గల్గిన లింగాంగ సామరస్య జ్ఞానము గల్గి బోధించు టకు అభ్యసించుటకు ముఖ్యాధారము ఇష్ట లింగము. యోగజాగమము-ఓంకారఐక్యరూప స్యాద్య కారశరణస్సదా........షడక్షరమయం భవేత్ —

ఇష్టలింగముచే గల్గు విజ్ఞానసర్వస్వము (సంపూర్ణముగా నెఱుంగుట) ఈ చిన్ని వ్యాసమున దెల్పుట అసాధ్యమైనను ఇష్టలింగ నిర్మాణము పరిమాణము, రూపము, అందలి పంచసూత్రములు అను విషయములను గురించి మిక్కిలి సమగ్రముగాగాక సంగ్ర హముగా వ్రాయబడినది. మతతత్త్వము లెఱింగిన మహాశయులు వాదోపవాదములకై తమవిద్యను కాలమును వ్యర్థపరుపక ఇష్టలింగ ముచేగల్గు విజ్ఞానసర్వస్వమును విపులముగా అన్ని భాషలయందును ప్రకటింపుచు వచ్చిన యెడల "లింగాలింగిత విగ్రహో విజయతే శ్రీ వీరమాహేశ్వరః" లింగాంగులగు శ్రీ వీరమాహేశ్వరులు సర్వత్ర విజయమొంద గలరు.

## మైసూరు ఇన్ష్యూరెన్సు కంపెనీవారు ౫౦౦౦ లను ఇచ్చుట

ఈ పత్రికలో ప్రతిపర్యాయము ప్రకటించుచున్న నోటీసువలన ఈ భీమాకంపెని వివర ములు పాఠకులకు తెలిసి యుండును. అత్రాఫ్ బల్దాజిల్లా ఏనులాబాదు గ్రామనివాసి పోతునకు రామన్నగారు ఐదువేల రూపాయలకు భీమాచేసి కొద్ది మొత్తమును మాత్రము చెల్లించి యుద్ధభీతివలన ఇటీవల నెలవారీగా కట్టుట మానుకొని ఇటీవల చనిపోయెను.కంపెనివారు ఎగవేయ వలయు నన్నచో అనేక కారణములుండెను కాని అట్లుగాక మిక్కిలి యౌదార్యముతో ఆలో చించి పై వారి ధర్మపత్నియైన భూలక్ష్మమ్మగారికి కంపెనివారు 6-8-1942 తేదిని సభ గావించి జనసమూహము నెదుట రు౫౦౦౦లను, ఇచ్చివేసి మహాజనుల స్తోత్రములకు పాత్రమైరి. దీనివలన ఈ కంపెనియొక్క సౌకర్యమును న్యాయపద్ధతియు గోచరించు చున్నది. భీమాచేయు వారికి మేమీ కంపెనియొక్క ప్రామాణికతను సిఫారసు చేయుచున్నాము. —సంపాదకుడు

## మరల 'విభూతి' ఆశ్వయుజములో

ఇది శ్రావణభాద్రపద మాసముల సంచిక కావున 'విభూతి' సంచిక మరల ఆశ్వయుజ మాసములో వెలువడుననియును, ఈ లోపుగ చందాదారులను గూర్చిన ఇచ్చి పుచ్చుకొనుటలు నెరవేరవలసి యున్న వనియును పాఠకులు తెలియగోరుచున్నాము.

మేనేజరు - 'విభూతి'

# శి వా జి

శ్రీచెన్నమరాజు కొండలరావుగారు

షాహ జీజీబాయిజన్మసాఫల్యంబు, తతభారతీయపాప్రిప్తనఫలంబు
ఔరంగజేబున కాంతరశల్యంబు, పరవీరగిరులకు పవినిభంబు
రామదాసమునీంద్ర రమ్యప్రసాదంబు, బుధజనాళికి కల్పభూరుహంబు
కుపితారిరాజన్య కూలంకషోద్ఘాట, పాటనక్రీడకు బాడబంబు
బలిమి నఫ్జలుఖానుపై బడి నిశాత, ఖరనఖరదారుణక్రియ కడగి చించి
నాటి నరసింహుబోలు మరాటి సింహు, డీతడు శివాజి ఛత్రపతీశ్వరుండు.

ఎవ్వాని రాజ్యంబు నిన్నూటడెబ్బది, యెనిమిది ఖిల్లాల నెనగుచుండె
నెవ్వాని సైన్యంబు లెనుబదివేల యాశ్వికదళంబుల తోడ వెలయుచుండె
నిరువదియైదు వేలెనగి సిలేదార్ల, మూక యెవ్వాని వెంట మూగియుండె
ఒకలక్ష కాల్బల మూని యేరాజన్యు, భటవర్గ మందున బారుదీర్చె
నౌకాసహస్రంబు నమరి సాగరసైన్య, మెవ్వాని యాజ్ఞకు నేచియుండె.
గజరథోష్ట్ర ప్రకాండంబు కడలి మించి, నే మహావీరు పాగాల నేపు జూపె
కుపితవీరారిగిరులకు కులిశనిభుడు, ఈతడు శివాజి ఛత్రపతీశ్వరుండు.

అమరాలయ విమర్దనాచారనిష్ఠుల, అమరాలయంబున అమర జేసె
వేదవిద్వేషంబు వెలయించు వారల, దేర్చి సత్పథముల తెరగు జూపె
మనుధర్మమార్గంబు మాన్పించు నరులను, మనుధర్మ మార్గంబు మాన్పజేసె
పరధరాధనదార ప్రశ్యతోహరులను, సురధరాభోగంబు చూరగొలిపె
తన ప్రతాపాగ్ని దశదిశల్ దగులుకొనగ, వైరిరాజన్యమస్తకావళులు దెచ్చి
దుర్గ కర్పించు శౌర్యనిర్ఘాతఖలుడు, ఈతడు శివాజి ఛత్రపతీశ్వరుండు.

దేవగిరీంద్రంబు దివిని యే శూరుండు, జన్మించు భాగ్యసంచయము వడసె
రాయగఢ్ దుర్గంబు రంజిల్ల నేరాజు, వసియించు పుణ్యంబు వాసిగనియె
గోదావరీదేవి కూర్మి నేవీరుని, నఘమర్షణ స్నాన మాచరించె
అబులు హసన్ తానషాబూని యెవ్వాని, సఖ్యంబు నెరపి సంసక్తుడయ్యె
వారు వీరను మతభేదవాద మెచట, వెదకి చూచిన లేనట్టి విమలయశుడు
వైరిరాజన్య గహనవైశ్వానరుండు, ఈతడు శివాజి ఛత్రపతీశ్వరుండు.

---

# శివలింగము, కాశి

అనువాదకులు: శ్రీమఠం సిద్ధివీరయ్యగారు, ఉపాధ్యాయులు.

శ్రీగణేశుఁడు:— పంచఉపాస్య దేవతలలో నొక దేవుడైన శ్రీ ఆదిగణేశుని మహేశ్వరుఁడు సృష్టియొక్క ప్రారంభమున సృష్టి కార్యములలోని విఘ్న బాధలపరిశమనార్థమై తన నిజాంశతోఁ బ్రకటన మొనరించెను. ఈ కారణముననే ప్రత్యేకముగ యజ్ఞాది శుభకార్యములలోఁ బ్రథమమున శ్రీగణేశుని పూజ జరుగును. మహేశ్వరపరాత్పరతత్త్వమే వ్యక్తరూపమున శివమూర్తిని ధారణ మొనరించినపుడు అట్టి అనాదిశైలి ననుసరించి శ్రీగణేశుఁ డతనియొద్ద పుత్రరూపమున నుత్పత్తి గాంచెను. మఱియు గణాదుల (దేవతల) కధిపతియై వెలసెను. శ్రీగణేశునికి వందన మొనరించి యతని గుణములను గానము గావించుటావశ్యకము. "శ్లో॥ ఓం దేవేంద్రమౌలి మందార మకరందకణారుణాః విఘ్నం హరంతు హేరంబచరణాంబుజరేణవః" ఈ గణాధిపుఁడైన గణేశుఁడు జ్ఞానదాత. కావుననే బుద్ధిమూలమున కార్యములను చేయుదురు. ఇతని విశాలమస్తకము ఇతని గొప్పతనము బుద్ధిని సూచించును.

ఈ బుద్ధిబలముననే యితని క్షుద్రమైన యధోభాగము యితని విశాలమైన యూర్ధ్వభాగమున కాధారమై యున్నది. మిక్కిలి లఘుజంతువైన మూషకమును వాహనముగా నుపయోగించును. దీని తాత్పర్య మేమనగా? ఆభ్యంతరిక జ్ఞానము మఱియు బుద్ధి ప్రచుర రూపమున ప్రాప్తమైనదాని బలము వలన మిక్కిలి స్వల్పమైన బాహ్యసామగ్రితోఁ గార్య ముత్తమోత్తమముగ సాగింపఁగలడు. సమాజమం దొకానొక నేత యుండి యోగ్యత గలవాడై జన్మించి యతడు శ్రీ గణేశుని కృపకుఁ బాత్రుడై యుండును. బుద్ధిమంతుఁడు స్వల్పపరిశ్రమచేత ఘనకార్య మొనరించును.

ఒకానొకప్పుడు శ్రీ మహాదేవునకు తన యజ్ఞమునకై దేవతావళిని రప్పించుటకు నిమంత్రణము గావింపవలసియుండెను. కార్తికేయ స్వామిచే నీ కార్యము నిర్ణీత సమయమునకుఁ బూర్వము నెరవేరదయ్యెను. అపుడే కార్యభారము శ్రీ గణేశస్వామిపై మోపఁబడెను. కాని యతని వాహన మల్పమూషకము. అది మిక్కిలి మందగతి గలది. అయినను శ్రీ గణేశుఁ డతివివేకముతోఁ బని చేసెను. శ్రీ మహాదేవునియందు సమస్త దేవతలు వాస మొనరించెదరని తలంచి యతనికి మూడు పర్యాయములు ప్రదక్షిణ మొనరించి దేవతల కందఱ కచటనే నిమంత్రణ మొనరించెను. దీని పరిణామ మేమైన దనగా- దేవతాసమూహమునకు యజ్ఞముయొక్క నిమంత్రణయొక్క వార్త గ్రాహ్యమై సమస్త దేవతలు యజ్ఞమున పాల్గొనిరి.

పరశివుడు - ఆద్యశక్తి

సృష్టియందు బరమపరాత్పరుడు శివుఁడు-మాండూక్యోపనిషత్తునందు శివుని గుఱించి ఈవిధముగ వర్ణనముగలదు.—"నాంతఃప్రజ్ఞం న బహిఃప్రజ్ఞం నోభయతః ప్రజ్ఞం న ప్రజ్ఞాన

ఘనం న ప్రజ్ఞం నాప్రజ్ఞ మదృష్ట మవ్యవ హార్య మగ్రాహ్య మలక్షణ మచింత్య మవ్యప దేశ్య మేకాత్మప్రత్యయసారం ప్రపంచోప శమం శాంతం శివమద్వైతం చతుర్థం మన్యంతే స ఆత్మా స విజ్ఞేయః."

ఎవరి ప్రజ్ఞ బహిర్ముఖము గాక, అంతర్ముఖముగాక ఉభయముఖము సైతముకాదో ఎవరు ప్రజ్ఞానఘనులుగాక ప్రజ్ఞగాక మఱియు అప్రజ్ఞయు గారో ఎవరు వర్ణన కతీతులో, దర్శనమునకతీతులో, వ్యవహారమునకతీతులో, గ్రహణకతీతులో, లక్షణమున కతీతులో, చింత కతీతులో, నిర్దేశమున కతీతులో, ఆత్మ ప్రత్యయమాత్రసిద్ధ, ప్రపంచాతీత, శాంతం, శివం, అద్వైతం మఱియు తురీయపదస్థితులో వారే నిరుపాధికులని గుఱుతింప యోగ్యులు. వీరి నామము మహేశ్వర, స్వయంభూ, ఈశానుడు అని శ్రుతియును పలుకుచున్నది.

"త మీశ్వరాణాం పరమం మహేశ్వరం
తం దేవతానాం పరమంచ దైవతం
పతిం పతీనాం పరమం పరస్తాద్
విదామ దేవం భువనేశ మీడ్యం"

"యస్మిన్నిదం యతశ్చేదం యేనేదం య ఇదం స్వయం యోఽస్మాత్పరస్మాచ్చ పరస్తం ప్రపద్యే స్వయంభువం" "తమీశానం వరదం దేవమీడ్యం నిచాయ్యేమాం శాంతిమత్యంత మేతి" అతడే ఈశ్వరులకును పరమ మహేశ్వరుడు, దేవతలకును పరమ దేవత, పతులకును పరమపతి, పరాత్పరుడు, పరమ పూజ్యుఁడు, మఱియు భువనేశుఁడు. ఎవరియం దీ విశ్వముండునో, ఎవరివలన నీ విశ్వముండునో, ఎవని మూలమున నీ విశ్వముగలదో, ఎవడు స్వయముగా విశ్వమో, ఎవడు ఈ విశ్వమునకు బరుఁడయ్యును పరుడుగానుండునో, ఆ స్వయంభూ భగవానుని నేను శరణుఁజొచ్చెదను. ఆయీశానుఁడు మఱియు వరదాతయైన పూజ్య దేవుని గుఱుతించుటచే జీవు డత్యంతశాంతమున కధికారియగును............ ఈ సదాశివుఁడు తన శక్తితోఁగూడి సృష్టినిరచించును. శ్వేతాశ్వతరోపనిషత్తునందు ఈ విధముగ వ్రాయఁబడినది.

"మాయాంతు ప్రకృతిం విద్యా న్మాయినంతు మహేశ్వరం, తస్యావయవభూతేస్తు - వ్యాప్తం సర్వమిదం జగత్" మాయాప్రకృతి మఱియు మహేశ్వరప్రకృతి - మాయయొక్క అధిష్ఠాతమాయీ - మాయమూలమున నతని అవయవ భూత జీవులతో సమస్తప్రపంచము పరివ్యాప్త మగుచున్నది.

ఈ విధముగ నీ యవ్యయసదాశివుఁడు సృష్టిని రచించు నిమిత్తము రెండు రూపములను పొందును. ఏలనన సృష్టి లేకద్వైత(ఆధార ఆధేయ)ము గాఁజాలదు. ఆధేయము (చైతన్య పురుషుఁడు) లేక ఆధారము (ప్రకృతి, ఉపాధి) నువ్యక్తము గాజాలదు. ఈకారణముననే ఈసృష్టిలో నెన్ని పదార్థము లున్నవో వానిలో నభ్యంతర చేతనము మఱియు బాహ్యప్రకృతి కాధారము, అనగా నుపాధి (శరీరము) చూడబడును. దృశ్యాదృశ్యమగు నన్ని లోకములలో నీ రెంటికి ప్రాప్తికలుగును. ఈకారణమున నీయనాది చైతన్యపరమ పురుష పరమాత్మకు శివసంజ్ఞ. సృష్ట్యున్ముఖమైనపుడు అనాదిలింగమై మఱియు నాపరమాధేయమున కాధార మొనగునట్టి యనాది ప్రకృతియొక్క నామము యోని. ఏలన నీ రెండు నీ యఖిలచరాచరవిశ్వమునకు బరమ

కారణము. శివలింగరూపమున పితయు, మఱి యును ప్రకృతి యోనిరూపమున మాత యును కలరు. గీతలో నిదేభావ మీవిధముగ బ్రకటన మొనరింప బడినది. "మమ యోని ర్మహద్ బ్రహ్మ తస్మిన్ గర్భం దదామ్యహం, సంభవః సర్వభూతానాం తతో భవతి భారత." గీత (౧౪ అ 3 శ్లో)

"మహద్బ్రహ్మ (మహాప్రకృతి) నా యోని, దీనిలో నేను బీజ మొసగి గర్భము యొక్క సంచారమును జేసెదను. మఱియు దీనివలన నన్నిభూతముల యుత్పత్తి యగు చున్నది. ఈ యనాది సదాశివలింగము. మఱియు ననాది ప్రకృతియోనినుండి సమస్త సృష్టి యుత్పన్నమగును. దీనిలో నాధేయ బీజ ప్రదాతా (లింగము) మఱియు నాధార బీజమును ధారణ మొనరించు(యోని) యొక్క సంయోగ మావశ్యకము. ఈ రెంటి సంయో గములేక నేదియు నుత్పత్తి నొందఁజాలదు. ఈ పరమభావమును మనువు ఈవిధముగ వర్ణన మొనరించినాడు.

'ద్విధాకృత్వాత్మనో దేహ
మర్ధేన పురుషోఽ భవత్
అర్ధేన నారీ తస్యాం స
విరాజ మసృజ త్ప్రభుః.

సృష్టిసమయమున బరమపురుషుడు తన యర్ధాంగమునుండి ప్రకృతిని వేఱుచేసి దాని యందు సమస్తసృష్టిని నుత్పత్తి జేయును. ఈవిధముగ శివలింగము నర్ధనారీశ్వర భావ మొకేవస్తువు. సృష్టియొక్క బీజముల నిచ్చు వాడు పరమలింగ రూపుడైన శ్రీ శివుఁ డెపుడు తన ప్రకృతిరూపనారినుండి యాధారాధేయ ముల భాతి సంయుక్త మగునో యపుడే సృష్ట్యుత్పత్తియగును. అన్యథా కాదు. ఈవిధ ముగ శ్రీశివుడు తన తేజోమయప్రకృతిని ధారణ మొనరించి దానివలన నాచ్ఛాదితమై వ్యక్తమగును. అన్యథా యవివ్యక్తమగు టసం భవము. ఇదేకారణమున చెప్పబడిన దేమ నగా "త్వయాహృతం వామవపుః శరీరం,త్వం శంభోః" అనగా నో దేవీ!నీవు శ్రీశివునియర్ధశరీ రము వామభాగమును హరణ మొనరించితివి. నీవే యతని శరీరమవు.

ఈ విధముగ నీ పరమపరాత్పరుడగు జగ త్పిత, దయామయియగు జగన్మాతయొక్క సంబంధము ఆదిమభావ మని ద్యోతకమగును. ఇది పరమపవిత్రమైన మ ధు ర భా వ ము. దీనియం ద శ్లీలతయొక్క యాక్షేపణ మొన రించుట యుక్తముగాదు. ఇది యనాది ప్రకృతి పురుషులయొక్క సంబంధము. పరమసృష్టి యజ్ఞము. దీని పరిణామము సుందరమైన సృష్టి. కామోపభోగము కాదుకాని, పితృ ఋణమునుండి యుద్ధారమగుటకు ఉత్పత్తి ధర్మమును పాలన మొనరింపవలెను. కామ చారముకాదు. పరమయజ్ఞము. మఱియు నీ విధముగ నాలోచించిన పరమకర్తవ్యము సిద్ధించును. ఈ దృష్టితో ప్రత్యేక జంతువు యొక్క పరమ పవిత్ర కర్తవ్యము: ఉత్పత్తి ధర్మమునుపాలించుటకు నుచితవ్యవహార మొన రింపవలెను. మఱియు వీనియజ్ఞార్థ ధర్మార్థవ్యవ హారములు చేయక కామోపభోగనిమిత్తము వ్యవహరించుట దురుపయోగము. మఱియు నవశ్యముగ పాపజనకము.........ఈ విధ ముగ శివలింగముయొక్క యర్థము జ్ఞాపకము లేక ప్రకటన మొనరించును. ఏలన నిది వ్యక్త మగుటచే సృష్టియొక్క యుత్పత్తియైనది.

రెండవయర్థము ఆలయము అనగా ప్రాణుల యొక్క పరమకారణము, మఱియు నివాస స్థానము. మూడవయర్థము "లీయతే యస్మి న్నితి లింగం" అనగా దృశ్యములన్ని దేని యందు లయమగునో అదియే పరమకారణ లింగమని వ్రాయబడినది.

'లీయమానమిదం సర్వం బ్రహ్మణ్యేవహి లీయతె' లింగము పరమానందమునకు కార ణము. దీనివలన క్రమముగ జ్యోతి మఱియు ప్రణవముయొక్క యుత్పత్తి యైనది. లింగ పురాణము ౧౭ వ అధ్యాయమున చెప్ప బడిన దేమనగా: సృష్టియొక్క ప్రారంభ మున బ్రహ్మ విష్ణువులమధ్య మన యిద్దఱిలో నెవరు శ్రేష్ఠులుఅని వివాదమొకటి జరుగునో చుండెను, అంతలోనే వారికొక బృహజ్జ్యోతి ర్లింగము గాన్పించెను. దాని యాద్యంతముల జాడ దీయుటకై విష్ణువు అధో భాగమునకు, బ్రహ్మ పై భాగమున కేగెను. ఇద్దరిలో నెవరికిని దానిజాడ దొరకలేదు. విష్ణువు స్మరణ మొనరిం చుటచే వేదనామకఋషి యచ్చట ప్రత్యక్ష మయ్యెను. విష్ణువున కిట్లు బోధించెను. ప్రణవ మందలి అకారము బ్రహ్మ, ఉకారమువిష్ణువు, మకారము శివుఁడు............ మకారమే బీజము; మఱియు నదేబీజము లింగరూపమున నన్నిటికిని పరమ కారణము. పై కథయందు విష్ణువువలని బ్రహ్మాండము విష్ణువని తాత్ప ర్యమా లేక మహావిష్ణువా? ఎవరు బ్రహ్మాం డము లన్నిటికి నాయకులో వీరి యందును సదాశివునియందును ఏమియును భేదములేదు. సవుఁడు, మంత్రము.

పరమపురుషుడగు శివుఁడు మఱియు నతని శక్తి యొక్క సమ్మేళనము వలననే స్పందము సముత్పన్నమైనదో, అదే సృష్టియొక్క యుత్పత్తికి కారణమైనది. దీనినే శివతాండవ నృత్య మనెదరు. రసాయన విజ్ఞానము యొక్క సిద్ధాంత మేమనగా? ఎలక్ట్రాన్ (Electrons) ఏవి పురుషుని సమానము ఆధేయము (Position) వాని ప్రోటను (Protons) ఏవి ప్రకృతి యొక్క సమానాధేయము (Negation) తో సంఘర్షమై యే స్పందన ముత్పన్నమగునో (Encircling motion) దాని మూలమున నణువుల యుత్పత్తియగును. వానివలన నాకారములు గలుగును.

సదాశివు డెవు డానందో న్మత్తుడై అనగా ఆనందముతో యుక్తుఁడై నృత్య మొన రించునో ఆ మహానృత్య పరిణామమువలన నీ సృష్టిపదార్థముల యుత్పత్తియగును. ఈ విధముగ నీ విశ్వము సదాశివుని నృత్యము యొక్క నాదముయొక్క పరిణామము. ఏలన నతడు నృత్యమునందు డమరు వాయించును. ఎచట స్పందన (Motion) మగునో యచట శబ్దము గలుగును. ఈవిధమున శ్రీ శివుని డమరుశబ్దము వలన (ఏది ప్రకృతి పురుష సమ్మేళన ద్వారా నాదరూపమున బ్రకటనమగునో) వ్యాకర ణము యొక్క ముఖ్యమైన శబ్దసూత్రముల యుత్పత్తి కలిగినది. ఈ శబ్దము నాలుగు ప్రకారముల శబ్దములై యంతిమ వైఖరీ వాక్ యొక్క వ్యక్తరూపము. అదియేశాక వర్ణమాలయొక్క ప్రత్యేకమగు నక్షరమున శక్తి సన్నిహితమైనది. ఈశక్తియొక్క కార ణమున నాభ్యంతరిక షట్చక్రములలో నీయ క్షరముల నివాసస్థానము. ఈశివశక్తుల నాద స్థానము స్వర్గోపరిభాగమునందున్నది. దీనినే (పరా) సంజ్ఞ యందురు. ఈ (పరా) సంజ్ఞను

స్వర్గలోకమున ఋషిగణము మంత్రరూప మునఁ గాంచెదరు. దీనివలననే దానిని (పశ్యంతి) యందురు. అయినను ఈ మంత్రము ఆ (పరా) యొక్క యాధ్యాత్మిక రూపము. దేనిని స్వర్గమునందు చూచె దరో వినెదరో కాని దానిని మంత్రమున వైఖరీ రూపమున బ్రకటితమగును. ఏలననగ శ్రీశివుడు ఆ పరావాక్కునకు గారణము. దీని ద్వారామంత్రము మొదలగు సమస్తవాక్య ముల యుత్పత్తి యైనది. అదియేగాక శ్రీశివ మంత్రశాస్త్ర పరివర్తకమని పలుకఁ బడును. శివపూజ యొక్క చివరనే బం,బం శబ్దము యొక్క యుచ్చారణ చేయఁబడును. అది ప్రణ వము యొక్క సులభరూపము. అది యత్యంత పరిభావశాలియై యున్నది.

పైన సదాశివుని వర్ణనమైనది. కాని యతని వ్యక్త భావము శ్రీమహాదేవుఁడు. మనుష్య రూప పిండాండము సర్వోత్కృష్టమగు నుదా హరణము. తాత్పర్యమే మనగా: మనుష్యుఁడు ఆధ్యాత్మిక జీవనమున మిక్కిలి యున్నతిని పొందగలుగునో, శ్రీ మహాదేవుఁడు అద్దాని కాదర్శస్వరూపుఁడు. అతనినే లక్ష్యమందుంచి సాధకు లున్నతిపథమునం దగ్రేసరులు గావల యును. ఈ కారణముననే శ్రీ శివుఁడు జగద్గురువైనాడు. తాత్పర్యమేమనగా: అతని యందు యజ్ఞము తపస్సు యోగము భక్తి జ్ఞానాదులు పరాకాష్ఠగా కాన్పించును. అది యతని యాదర్శము. మఱియు నుపదిష్టము. శివుని మూడవ నేత్రము దివ్యజ్ఞానచక్షువు. ఇది ప్రత్యేకమనుష్యుల కేరికిని నుండదు కాని యిది శ్రీ జగద్గురు శివుని సహాయములేక తెరువబడదు. గాయత్రిశక్తి శివుని యా యాదర్శము నే తీసికొనును. మఱియు తన సృష్టి కార్యములయందు దీనిని లక్ష్యమొనరించి యితరసాధకుల నీ విషయమునఁ బ్రవృత్త మొనరించును.

ఆ ధ్యా త్మి క కా శి

సాధకుని చిత్తవృత్తి శుద్ధము, శాంతము, నిఃస్వార్థమై తన యభ్యంతరముయొక్క ఆధ్యా త్మిక హృదయము నం దెచట ప్రజ్ఞాబీజ ముండునో యచటనేయుండును. ఆ యవస్థకే కాశీప్రాప్తియని చెప్పుదురు. ఈయవస్థ పరమ సుషుప్తితో సమానమైనది. దీనియం దానం దముయొక్క యనుభవమగును. ఈకారణము ననే కాశీని ఆనందవన మని చెప్పెదరు. ఈ కాశియందు మహాశ్మశానస్థితి (ఇచ్చట శివుని వాసస్థానమైయుండును) యొక్కకారణ మేమ నగా నిది శివుని తేజమున వికారములను దగ్ధ పరచినతరువాత అనాత్మరూప యుపాధుల నుండి విముక్తత గాంచును. అహంకారము సైతము దగ్ధమగును.

గౌరీముఖ మనగా భావమేమి? ఈ కాశీ ప్రాప్తి యవస్థలో సాధకుఁడు దైవీజ్యోతి మఱియు బోధకశక్తియొక్క సమ్ముఖమున బ్రవే శించును. అప్పుడే యతని యాధ్యాత్మిక దివ్య చక్షువు శ్రీ శివునిద్వారా వికసితమగును. అంత నాతఁడు మూడులోకముల దాటి చేరినవాడై గౌరీ అనగా విద్యాదేవిని ఆవగణలేక చూచు టకు సమర్థుడగును. మణికర్ణిక యేపరిణవకర్ణిక. ఇచటి మూడు కర్ణికలలో చిత్తముయొక్క మూ డవస్థలు ద్యోతకమగును. ఎట్లనగా? (౧) సాధారణ, జాగ్రిత, అవస్థా. (౨) దూర దర్శన దూరశ్రవణావస్థ. (3) స్వర్గలోకావస్థ. కాశీ ఈమూటిని దాటియున్నది. దీని లాభము

వలన ముక్తిగలుగును. శ్రీ శివుఁడు తారకమంత్రము నపుడే ప్రదానముచేయును. సాధకుని హృదయరూపమైన కాశీయందు (కారణకాశి) స్థితమగును. అపు డతడు తారక మంత్ర ప్రభావమున సదాతురీయావస్థయందుజేరును. ......త్రిశూలముయొక్క భావ మేమనగా: త్రితాపములను నశింపఁజేయుట అనగా త్రితాపములనుండి ముక్తిచెంది జాగ్రత్ - స్వప్న - సుషుప్తి ఈ 3 అవస్థలనుండి దాటి తురీయావస్థలో జేరుట. ఇట్టి సాధకుఁడే యథార్థముగ త్రిశూలధారి.

## అ న్య భా వ ము

శివుని మస్తకమునందు చంద్రుని సంకేత ప్రణవముయొక్క యర్ధమాత్రమునుండి యున్నది. ఈకారణమున నతని మస్తకమునం దర్ధచంద్రుఁడు భూషితుఁడై యుండును. యోగిగణము తమ యభ్యంతరమును చిత్ యను అగ్నిద్వారా అహంకారమును దగ్ధ మొనరించెదరు. మఱియు దానివెంట దానిపనులు పంచతన్మాత్రలు పంచమహాభూతములు మొదలగు వాని నన్నిటిని దగ్ధ మొనరించి పరమ శుద్ధమగు నాధ్యాత్మిక భావమున పరివర్తిత మొనరించును. అప్పు డది నిర్వికారముశుద్ధము శాంతముగల దగును. దానినే భస్మమనెదరు. అటువంటి శుద్ధ భావరూపమగు భస్మమును ధారణ మొనరించుటచే శాంతి లభించును. ఆధ్యాత్మికగంగ యొక గొప్ప తేజఃపుంజము. అది మహావిష్ణువు యొక్క చరణములనుండి వెడలి బ్రహ్మాండ నాయకుడగు శ్రీ మహాదేవుని మస్తకముపైఁ బడును. మఱియు నట నుండి ప్రపంచ కల్యాణార్థము వ్యాపించును. ఈ తేజఃపుంజమును కేవలము మహాదేవుడే ధరింపఁగలడు. ఏలన శివుఁడు మఱియు విష్ణువు ఒకడే. శ్రీ శివుని కృపచేత నీ యాధ్యాత్మిక గంగయొక్క లాభ మభ్యంతరమున అంతరస్థమగు కాశీక్షేత్రమున గలుగును.

శివునికి పంచముఖములు గలవు. ఈశాన అఘోర-తత్పురుష- వామదేవ - సద్యోజాత. ఈశానమున కర్థము స్వామి, అఘోరమున కర్థము నిందితకర్మలను చేయువారు సహితము శ్రీ శివుని కృపచేత నిందితకర్మలను శుద్ధముగా నొనరించుకొనెదరు. తత్పురుషమున కర్థము తనయాత్మలోస్థితిని లాభమునొందుట. వామదేవమనగా: వికారములను నాశన మొనరించునది. సద్యోజాతము బాలునితో సమముగఁ బరమస్వచ్ఛము శుద్ధము.మఱియునిర్వికారము. త్ర్యంబకమున కర్థము బ్రహ్మాండమందలి త్రిదేవులు. బ్రహ్మ విష్ణు మహేశులు ముగ్వురయొక్క అంబ - అనగా! కారణము. జీవాత్మ యొక్క తీవ్ర భక్తి(సేవ) లభించుట ప్రగాఢమగు ననన్యానురాగము, అనగా విశుద్ధనిష్కామతుక ప్రేమచే శివప్రాప్తి కలుగును. ఆ యనురాగము లభించుట చేత శ్రీశివునిచరణకమల స్పర్శయొక్క పరమశాంతిలో పూర్ణత్వము ప్రాప్తించును.



# ధర్మప్రచారము

[గత సంవత్సరాది సంచిక తరువాయి]

శ్రీ కవిరత్న లక్కన మల్లికార్జునుఁడుగారు

ధర్మప్రచారకుఁడు:—

గీ॥ ధర్మబోధలు బోధించి ధన్యజనుల
కీర్తనల్ బొంది సాహిత్యకిరణవితతి
భారతావని వెలిగించి పేరుపొంది
క్రాలితివి విభూతి సుపత్రికామతల్లి.

భోగపురుషుఁడు:—ఓహో ధర్మ ప్రచారకులా! ఏమి విశేషములు? గత సంవత్సరాది సంచికలో మనము పెట్టిన దరఖాస్తునకు ఫలితమే మైన కలిగినదా?

ధర్మ:—ఫలితమో అఫలితమో నిర్వచించుట కవకాశము కలుగ నేరకున్నది. ప్రపంచమంతయు తారుమారగుటకుగాను కదనంబులు చెలరేగి బీభత్సములు కావించుచున్నవి.

భోగ:—ఓహో అట్లనా! ఇది నాకు విదితమె. లోకమంతయు హింసమయము. హింస చేయని జీవి హింస పొందని జీవి లేదనియే చెప్పవచ్చును.

ధర్మ:—నీకు హింసను గురించి బాగుగా తెలియునా? తెలిసిన ఆ హింసను గురించి విపులముగ వివరింపుము.

భోగ:—హింసఅనగా నాయూహ ననుసరించి ఒక జీవి మరొక జీవికి కలిగించెడి బాధయని నిర్ణయంబునకు వచ్చితిని. ఈ మహా జగద్వలయంబునం దే జీవియైనను పరజీవిని బాధింపకయే ప్రవర్తించుచున్నదా యని ప్రశ్నించుకొనిన తేలగలదు.

ధర్మ:—ఏమి టీ తేలెడి విషయము?

భోగ:—క్రిమికీటకములందుమృగజాతులయందు జంతుజాలములందు జలచరములందు ఒక జీవికి నింకొక జీవిచే హింస కలుగుచునే యున్నది. ప్రకృతి నైజ గుణంబు విచారించిన నొక జీవి శరీరము వేరొక జీవి కాహారముగా నుపయోగించుచున్నది. కాన ప్రతిజీవి తన క్షుద్బాధ నివారణార్థమై పరజీవిని బాధించుచునే యున్నది. కనుక హింసపొందని జీవి, హింసచేయని జీవి లేదనుట నిర్వివాదము. ప్రకృతిస్వభావమే హింసమయము. కాన జగత్తంతయు బలాధీనము. ధర్మములేదు. మర్మములేదు.

ధర్మ:—ఔను, నీవు చెప్పినది నిజమే కాని విజ్ఞానమయుడైన మానవునకు హింసతోనిమిత్తము లేకయే జరుపుట కవకాశముగలదు.

భోగ:—పిచ్చి, పిచ్చి. నీనమ్మిక యంతయు పిచ్చిదే? అన్నిజీవుల వలెగాక మానవునకు విజ్ఞానకోశ మెక్కుఁడు కలదు. ఆ విజ్ఞాన మహిమవలన తన కర్తవ్యము తాను నిర్ణయించుకొనుటకు సమర్థత యేర్పడుచున్నది. నరు డొంటరివాడుకాడు; సామాజికుఁడు. కనుక మానవజీవిని సమాజపక్షి యనుట సమంజసమగును. కాన నరు డొక నరసమూహములో చరించుచుండును. అట్టినరు డేరీతిగ హింస చేయకుండ నుండగలడు?

ధర్మ:— ఏమీ? హింస చేయకుండుటకు వ్యవధియే లేదందువా?

భో:—లేదు ముమ్మాటికి లేదు. సామాన్య జీవులకంటె మానవుడే ఘోర హింసలు కావించుచున్నాడు. ఎట్లన ప్రతినరునకు జన్మదేశము జాతీయవిద్య జాతీయ ప్రభుత్వము జాతీయ కర్తవ్యములు నిర్వహింపగల శక్తులు జన్మతః కలుగుచున్నవి. అది యట్లుండ నరునకు భోగలాలసత్వము అధికారపిపాస అహంకారభావోద్రేకములు పుట్టుచున్నవి. అందువల్ల నరుఁడు దురాశాపరుడై తనకువలె బ్రతుకుచుండెడి మానవకోటిని హతమార్చి పరదేశము లాక్రమించుకొని సాటి మానవులకు దాస్య మొసంగి హింసా రూపకంబైన పాలనంబు గావించుచుండుట హింస కాదందువా? కనుక నరుడే ఘోరహింసలు కావించుచున్నాడనుటకు ననుమానింపవలదు.

ధర్మ:—పాలనములో గూడ హింస కలదా? ఏమిటి చిత్రముగానున్నదియె!

భోగ:—నీకు చిత్రంగానే ఉంటుంది. లోకజ్ఞానము లేనివారికి గోచరించదు. వ్యక్తిస్వాతంత్ర్యము వచ్చిన తరువాత నెంత వైపరీత్య మేర్పడెనో తెలియునా?

ధర్మ:—ఆ చిత్రము లేవియో చెప్పగలవా?

భోగ:—బాలుడు మొదలు యువకుల వరకు ఒక్కడేని మాతాపితరుల మాటలను పెడచెవినైనను బెట్టి వినువారు లేరు. ఇక ఆజ్ఞనుపాలించువారెవరు? భార్యలనుహింసించు పతులును; పతులను తృణీకరించి పరులవలల జిక్కించుకొను భార్యలును లోకమున బాధను ప్రచారము చేయుచున్నారనక తప్పదు కదా! గురువుల దూషించు శిష్యులును; శిష్యుల సణగ ద్రొక్కు గురువులును చెలరేగు చున్నారు గదా! పరధనములను, పరప్రాణములను పరమానములను పరస్పరముగ నపహరింప దలంచుట నహజమై పోయెనే? కపటసాక్ష్యముల బల్కువారును, అధర్మమును నిర్ణయించువారును, తమకు లవము దెలియకున్నను అంత నెఱిగిన వారివలె నేకరువు బెట్టు వారును, తాము దానముచేయ కున్నను చేసెడి వారి నీసడించు వారును, పరుల మేలు నోర్వని వారును, దిక్కులేక బిచ్చమెత్తుకొను వానిని సైతము పీడించు వారును ఈ లోకమున సుఖముల ననుభవించు చున్నారు. ఇదియంతయు 'బలము గలవానిదే బర్రె' యన్నట్లున్నది. బలహీనుని కష్టములు భగవంతు డెరుగు కావున నిట్టి అన్యాయమయమైన పరిపాలనకు ఎవరు కారణమైనను అంతయు అధర్మమయముకదా? హింసామయము కదా?

ధర్మ:—బాగున్నది. ఆది యుగంబున నుండియు ప్రపంచ యాత్ర హింసతోనే చేసినదియా?

భోగ:—ఏమీ, ఆదినుండి హింస లేదందువా? ఎందుకు లేదు? ఎన్నెన్ని యుద్ధములు జరుగలేదు! ఎందరెందరిని హింసింపలేదు! కనుక ఎప్పుడు కదనంబులు కలవు. ఆయుద్ధంబులందు హింస జరిగియే తీరును కాన ఈ హింసతో గూడిన ఈ మాయా ప్రపంచంబున ధర్మమేమిటి అధర్మమేమిటి? బలాబలములే జయాపజయములకు కారణములు. కాన ప్రస్తుతము బలహీనులైన వీర శైవులకు శుభోదయ మెట్లు కలుగును? మన దరఖాస్తులేమి పని చేయును? మన శ్రమ మంతయు వృథ.

ధర్మ:— ఇహసంబంధపు చూపుతోనే నీవు నిర్ణయించుచున్నావు. అది మానవునకు పతితత్వము కలుగచేయును. కాన పరముకై జీవన్ముక్తికై కొంత విచారించి హింసకు దూరుడై అహింసాసిద్ధాంతములకు రావలెను. అట్లు వచ్చిననాడే నరుడు పరుడగుచున్నాడు.

భోగ:— ఏమేమి? అహింసా సిద్ధాంతములకు రావలెనా? ఎంతవెఱ్ఱి. మీ ధార్మికులు వచించెడివన్నియు వింతగానుండును. ఒక గృహస్థుడు "నాకు మా యాబిడకు కావలసినంత సిగ్గుకలదు. ఈ బిడ్డ లెట్లు పుట్టిరా?" అని వింతపడినట్లు మీ ధార్మికు లేదోఒక మాయో పాయపు టుక్తులచే సమర్థింతురేగాని సరియగు అహింసాపరు లెవరుగలరు? రాముడు రావణాసురుని, రావణుసిబ్బందిని ప్రజలను హింసించి ఖండించి జయమంది నపుడు మీ ధర్మజ్ఞులు రాముడు చేసినది దుష్టసంహారము గాన హింస కాదన్నారు. రాముడే దేవు డన్నారు. అది మానవ నైజగుణము. అంతియేగాని అది హింసగాక మరేమగును?

ధర్మ:— రాజులు రాజకీయవేత్తలు దుష్టశిక్షణము శిష్టరక్షణము చేయుట ధర్మమనిరే కాని హింసకాదని ఎవ రనగలము. కాని హింసకు దూరము నహింస కునికియునైనది మతము. మతత్రయసంపన్నుడైన మానవుని మోక్షపరునిగా చేయగలిగినది మతము. ఆ మతములు హింసాపరులచే స్థాపింపబడినవి కావు. అహింసా సిద్ధాంతము లందు తీర్ణులై నిజజపతపోమహిమలు చూపి దుష్టులనుసైతము తమ వశము కావించుకొని మానవకోటికి సుగతి జూపిన మతాచార్యులచే నెలకొల్పబడినవి. కాన మతమునందే అహింసాసిద్ధాంతము నిలబడియున్నది. ఏమందువు?

భోగ:— ఏమేమి? ఏమతాచార్యులు హింసలు కావింపలేదా? విపులముగా వచింపుము.

ధర్మ:— లేదు. ఏ మతాచార్యులు హింస చేయలేదు. వారివారి పాండిత్య వివాదములతో, తపోమహిమలతో పరులను, పరమతాచార్యులను తమ మతములోనికి త్రిప్పుకొనగలిగినారు. మహాపండితులు మహామహులు అపరశంకరావతారులు అద్వైత మతాచార్యులు నగు శ్రీశంకరాచార్యులంతటి వారిని శ్రీరేణుకాచార్యులు తన హితబోధచే తన మహిమచే లింగారాధనమహిమ దెలిపి యొప్పించి చంద్రమౌళీశ్వర లింగము నిచ్చిన సంగతి మరచితివా? కనుక వారలు మహిమచేతనే వ్యాపింపగలిగిరి కాని హింసచేగాదు. వారికి హింస దూరము. వేయేల? ఇటీవల ఔరంగజేబు నంతటి వానికి తన మహిమను చూపి వాని హృదయమును పరివర్తనము గావించి బహుమానము లందిన కాశీపీఠాధిపతులను మరచితివా? కాన మతమునందు మతధర్మములందు హింస లేదు. ఆ మతధర్మములు తెలుసుకొనుట కష్టతరము సుమీ.

భోగ:— అసలు వీరశైవమత వాఙ్మయమంతయు మూలమూలల నొదిగి యున్నది. ఎవరు దానిని విచారించి తెలుసుకొనగలరు?

ధర్మ:— ఆమాట నిజమే. మన వీరశైవమత సాహిత్యము ప్రకాశింపజేయ సమర్థులరుదు. ప్రస్తుతము ఇహమునకు సంపద లొనగ జాలక పోయినను శ్రీమచ్ఛిదిరెమతాధినాథుల సాహిత్యసేవ మతధార్మిక ప్రచారము, ధార్మిక గ్రంథముద్రణలు గురుకులాశ్రమ నిర్వహణాదుల గురించి ఎంత కొనియాడినను తనివితీరదు సుమీ!

భోగ.—ఔను నిజమే. వారు చేసెడిక్రియలన్నియు ప్రశంసాపాత్రిమే! ఇహవాంఛాపరుడైన నాకే వారిని తిలకించినంతనే ఏదో ఒకవిధమైన వైరాగ్యభావము కలుగును. వారి నిష్కలంకమైన వాఙ్మయ ప్రచార దీక్ష, ఆహారపానీయ నియామకదీక్ష; సునిశితమైన వీరశైవదీక్ష; శివోపాసనా దీక్ష; మొదలగు వాని విలువలను తూచ నాబోటి అల్పజ్ఞులకు చేతగానిపని.

ధర్మ:—అంత మహిమలు కలవారలు కనుకనే ఈ విపత్కాలములందు గూడ మానవ జన్మోద్ధరణకు ననువగు మత ధర్మములు లోకమునకు నివేదించుచున్నారు.

భోగ:—ఆ విషయము చెప్పదగి నదియే సుమీ.

ధర్మ:—చెప్పదగినది యేమిటి? నుతింపదగిన విషయమది. ఈయుద్ధజ్వాలలు చల్లారిన యనంతరమైన మన ఇహపర సాధనోద్ధరణ దరఖాస్తునకు సంపూర్ణఫలితము రాగలదు. అందుకు మ హా మ హు ల ఆశీర్వచనములే హేతువు. కనుక అధునికవీరశైవ మతోద్ధారకమగు శ్రీమద్విభూతి పత్రికను కొనియాడుచు భవిష్యద్భాగ్యమునకై నిరీక్షించుచుండి మరల ముందు వచ్చెడి సంవత్సరాది సంచికలో ప్రసంగించుకొందము, పద.

(నిష్క్రమింతురు.)

# విద్య - విజ్ఞప్తి

శ్రీ బూసా వీరయ్యగారు.

మానవులై జన్మించిన ప్రతి వ్యక్తికిని విద్య మూలము. విద్యయే విజ్ఞానమునకు విత్తనము. విద్యయే యైశ్వర్యము. విద్యయే గౌరవము, విద్యయే సభాపూజితము. వేయేల విద్యయే సర్వసాధనము. అట్టి విద్యను సంపాదింపవలయునన్న సులభముకాదు. ఫలముల యట్లు వృక్షములనుండి సంగ్రహించునదికాదు. నీరముల భంగి కూపములనుండి కొనివచ్చునదియుంగాదు. గారడివానికరణి తాంత్రికముచేసి యార్జింతమన్న వలనుపడదు. రణరంగమున మహావీరునివలె శత్రువుల జయించి సాధింతమనిన సాధ్యపడునదియునుం గాదు. చోరునివలె పరగృహములకు బొఱియవేసి నగలవలె దొంగిలింతమన్న దొరకునదియుం గాదు. వడ్డివ్యాపారివోలె కాసుకు కాసుగూర్చి గడింతమనిన సమకూరునదియునుంగాదు. విద్యాగురువులం జేరి యోర్పుగలిగి నేర్పుచేత సాధించవలసియున్నను "పూర్వదత్తేషు యా విద్యా" యను నార్యోక్తినిబట్టి పూర్వార్జిత సుకృతమువలనం గాని విద్య లభింపదు. అట్లయని ప్రయత్నమును మాత్రము మానరాదు. విత్తు విత్తకయే చెట్టు పుట్టు టెట్లు? చెట్టు పుట్టకయే ఫలించు టెట్లు? విత్తు విత్తి దినదిన ముదకము ప్రోక్షించు నెడల మొలక ఉద్భవించి క్రమముగ వృక్షమగును. పిదప ఫలించును. లేక ఫలింపక పోవచ్చును. ఈశ్వరాజ్ఞ. పసిపాపలకు చిన్నతనమునుండియుం దల్లులు మాటలనేర్పుచుందురు. అందునను కొందరు పాపలు మూగలగుచున్నారు. అట్లని తల్లులు తమ ప్రయత్నమ్ముల మానిరా? లేదు. అటు లాచరించుట వారి కర్తవ్యము, అటులే ప్రతివారును తమ బాలురకు విద్య నేర్పించుట ముఖ్యాతిముఖ్యము.

బాలురకు తలిదండ్రులు నేర్పించిన విద్యయే వారి యావజ్జీవపర్యంతము వారివలెనే కాపాడుచు నున్నతోద్యోగము లిప్పించును. గురువువలె జ్ఞాన మిచ్చును. లక్ష్మివలె ధనము నిచ్చును. రాజువోలె సన్మానమిచ్చును. భూజముల యట్ల ఫలము నిచ్చును. భూధరము పగిది ధైర్య మిచ్చును. భూమివోలె నోర్పు నిచ్చును. కల్పవృక్షము కరణి కామితము లీడేర్చును. మంత్రివలె యోచనాశక్తినిచ్చును. ధర్మపత్ని యట్ల సుఖమునిచ్చును. ఇట్టి సర్వైశ్వర్యఫలప్రదాయిని యగు విద్యాదేవతను విడనాడు విజ్ఞులు గలరా? గణితమును వేసి చూడుడు. వీరశైవమున విద్యగల మహనీయులు నూటికి పదుగురైనను బయల్పడుదురేమో? ఇతరజాతీయులందు నూటికి తొంబండ్రుగు రీ దేవత నుపాసించుచున్నారు. వారివారి విద్యకు దగినరీతి నుద్యోగములందుత్తీర్ణు లగుచునే యున్నారు. కాని మా యాంధ్ర వీరశైవము మాత్ర మా నోము నోచుకొనకపోగా, పైపెచ్చేమన, వివిధ ప్రయాసలకోర్చి విద్యనభ్యసించిన యొకరిద్దరు పండిత ప్రకాండులు బయలుదేరిన, వారి

నాదరించు వారు సైతఁ మగుపడరైరి. అట్టి సన్మానము లాచరింపకున్నను ఆ పండిత శ్రేష్ఠు లూహించి చేయు సత్కార్యముల నుల్లంఘించి విఫలంబుఁ జేయ నుంకింపకున్నఁ బదివేలు. అమ్మపెట్టదు, అడుక్కొని తిన నీయ దన్నట్లు వారు చేయనూలేరు. చేయువా రుండిన చూచి సహింపనూ లేరు.

వెంద్రుకం దవిలి మొగ్రబాకుదమను తలంపున బీదలు కష్టించి చదివి స్వల్పఉద్యోగము లేవైన నార్జించి సుఖింతమన్న వానిని విఘ్నమొనర్పజూచు వేత్తలే మెండు. ఇఁక పండితులు, ఉద్యోగులు, విద్యార్థులు మున్నగు యశస్కాములు వెలికివచ్చు టెట్లు? ఉన్నారని తెలియుటెట్లు? కోర్కెగలవా రెవరేని పండిత వాక్కులను చెవులారవిని యానందించు భాగ్య మబ్బకపోయినను, తమ స్వార్జితమైన నాలుగణాలు వెచ్చించి ప్రతిభగల వా రందించు విజ్ఞానపత్రములనైనఁ గనులారచూచి నోరూర జదివి సంతసింతుమన్న సైతాను శక్తివలె చెడగొట్టు సాధుసత్తములు చెలరేగుచుండిరి. ఇఁక నేమిచేయనగు? ఇట్టి విపరీతబుద్ధులకు సంపూర్ణ విద్యాగంధశూన్యతయే కారణము.

విద్యలేనివాడు వింతపశువు. మీ బిడ్డలకు విద్యగఱపింపుఁడయ్యా యని ఘను లెవ్వరైన గౌరవముగ నివేదింప, మాకు చదు వచ్చుబాటు లేదనువారు కొందఱు, మాకు లేకలేక కలిగిన యీ పసిపాపఁ డొక్కడే, గురువుగారు శిక్షించుశిక్షలకు మేము సహింపలేమను వారు కొందఱు, ఎల్లరు చదువుకొని సంపాదించినవారే యున్నారా? మా తాత చదువుకున్నాడా? మా నాయన చదువుకొనినాడా? నేము చదువుకున్నామా? మే మందఱము భూముల సంపాదింపలేదా? మాతాతలు ద్రవ్యమార్జింపలేదా? వారివారి యదృష్టములకొలది వారే సంపాదించుకొనెదరనే వారు కొందఱు, మా యబ్బాయి చదివితే మైండు కఱగిపోతుందని తమ తెలువులు తేట తెల్లమగునటులఁ బలికి, తమ మూఢత్వము దమ బిడ్డలకు సైతఁ ముగ్గుబాలతో నూరి త్రాగించుచున్నారు. తాతకుఁ బెట్టినబొచ్చె తలదాపుననే యున్నదన్నట్లు, వంశపరంపరా వారును, వారి నాట్యమునే యాడుచుందురు. ఇఁక క్రొత్తనాట్యమే కొండనుండి యూడిపడగలదు. ఎవరుత్రవ్వికొనిన గోతిలో వారే కూలుదు రన్న ట్లెవరికర్మఫలములు వారే యనుభవించుచున్నారు. ప్రసూత్యంతమున నేత్రద్వయాంధకారము గ్రమ్మిన దర్వీకరంబు తన యండంబులం దానే గబళించు కరణి తమ సంతతుల దామే విద్యావిహీనులం జేసి చెఱుపం దలంచుట సమంజసము కాదు. మీ కన్నకుమారునకు మా కన్య నిచ్చెదము చేసికొనుడయ్యా యన, మా అబ్బాయి కచ్చిరా దన్నట్లు వీరశైవగురుకులాధికారులు విద్యాదాన మొనర్తుమని సూచింపుచుండ నందున కొడంబడువారును అరుదైరి, బలవంతపు బ్రాహ్మణార్థముగాఁ బిల్లలనుబట్టి తెచ్చి విద్యఁ గఱపి వీరశైవ పండితులుగా వెలిబుచ్చుదమన్న మూలధనమైనను మూల్గుచున్నట్టు కనుపించదు. ఇక వీరశైవ ప్రపంచమున విద్యాబీజ మెట్లంకురించును? వీరశైవ మతము నలమికొనినవిద్యావిహీనాంధకారము వీడుటెట్లు? క్షేత్రి మెఱిగి విత్తనమును, పాత్ర నెఱిగి దానమును జేయమన్నారు పెద్దలు. ఆలాగుననే "విభూతి" పుం. ౩. ౧౧వ రేఖ

యందు సంపాదకులు సూచించిన "వీరశైవ గురుకులమునకు మహాజనుల దాన" మను పట్టిక నవలోకించి ప్రతి వీరశైవుఁడు నుదార బుద్ధి నవలంబించి వర్షాశన చందా దాన మొన ర్చిన విద్యార్థుల కెంతయేని యుపకారమగును. తాము జేర్పందలంచిన తమ పుత్రులకు సైతము సౌఖ్యము సమకూరును. సులభముగా బాలురు విద్యఁ బడయగలరు. వీరశైవమున పండిత ప్రసూనములు ప్రబలవలయు ననిన నింతకన్న వేఱొండు మార్గమేలేదు. తమతమ బాలుర విద్యాభివృద్ధి గోరువా రెల్లర కింత కన్న గత్యంతరము లేదు. వీరశైవలోకము నావరించిన విద్యావిహీనాంధకారము బాపు పండిత దీపములను వెలిగించుట కింత కన్న మఱియొకత్రోవయే గాన్పింపదు. తమ పుత్రు లెల్లరును విద్యాదేవత నుపాసించు మార్గ మవలంబింపఁ జేయువలయును. విద్యను మఱువరాదు. విద్యయే సర్వైశ్వర్యసాధనము.

## 'విభూతి' — వెనుకటి సంచికలు

'విభూతిలో' లో అనేకములైన అమూల్యములైన వ్యాసములు ముద్రింపబడియుండుట పాఠకు లెఱింగిన విషయమే! పండితులు పామరులు గూడ సంగ్రహించు కొనదగియున్నవి. పరమతీయులకు ఇవి ప్రమాణములుగా నిరూపింప వచ్చును. ప్రతిసంచిక లన్నియు లేవు కాని ఉన్నవి కూడ చాల కొలది. ఆలసించినచో దొరకవు.

| | | | | |
|---|---|---|---|---|
| ౧ వ సంపుటము | ౬ వ సంచిక నుండి | ౧౨ వరకు | వెల | 1—12—0 |
| ౨ వ ,, | ౧ వ ,, | ౧౨ ,, | ,, | 2—12—0 |
| ౩ వ ,, | ౭ వ ,, | ౧౨ ,, | ,, | 1— 8—0 |

నెలను మొదలే మనియార్డరు చేసినవారికి మాత్రమే రిజిష్టరుగా పంపబడును. ఈ మొత్తము మూడుసెట్లుగా కావలసినవారు 5—3—0 లను పంపుచో రిజిష్టరుగా రవానింతుము. ఇందు వారికి లాభము కలదు. విడివిడి సంచికలు ఎంత వెలయిచ్చినను లేవు. వి. పీలు చేయబడవు. త్వరపడవలెను.

మేనేజరు: "విభూతి" సికిందాబాదు, దక్కన్.

# పుష్ప సేన విజయము

ఇది మఠం సిద్ధవీరయ్యగారిచే విరచితమైనది. అద్భుతమైనట్టియు ఆహ్లాదమైనటియు కథావిశేషములు గల చక్కని నవల. శైలిసరళము. నీతిబోధకము. ప్రతియొకడును తప్పక చదువదగినదని గొప్పవారు అభిప్రాయముల నిచ్చినారు. వెనుకటి వెల ౧-౮-౧ ప్రస్తుతము 0-4-0 మాత్రమే. కొలదిప్రతులే కలవు. త్వరపడుడు.

మేనేజరు, శివధర్మగ్రంథమాల; సికిందాబాద్.

# భాద్రపద నక్షత్రఫలితములు

## శ్రీబులుసు సూర్యప్రకాశశాస్త్రిగారు

ఈ మాసమున వర్షము లచ్చటచ్చట బాగుగ కురియును. నదులు సామాన్యముగా ప్రవహించును. శుక్ల పక్షమున రసవస్తువులకు ధరలు సామాన్యముగా నుండును. కృష్ణపక్షమున ధరలు బాగుగ కలిగియుండును. ధాన్యాదులకు ధరలు సామాన్యముగా నుండును. వెండి బంగారములకు ధరలు పెరుగుచు తరుగును.

అశ్విని :—సత్కార్యాచరణ, ప్రయాణం, కించిదనారోగ్యం, చిత్తచలనం, ధనవ్యయం.
భరణి :—ధనలాభవ్యయములు, సోదరకలహం, కించిదనారోగ్యం, మనస్తాపము.
కృత్తిక :—అనారోగ్యం, ధనవ్యయం, కుటుంబ అనారోగ్యం.
రోహిణి :—ఆరోగ్యం, యత్న కార్యాలస్యం, ధనలాభం, బంధుమిత్ర సమాగమం, వైరులు.
మృగశిర :—శరీరతాపం, చిత్తచలనం, ప్రయాణం, కార్యానుకూలం, ధనవ్యయం.
ఆర్ద్ర :—కోపం, శరీరతాపం, సోదర కలహం, కుటుంబ అనారోగ్యం.
పునర్వసు :—మంచివిద్య, ధనలాభ వ్యయములు, కించిదనారోగ్యం, కుటుంబ సౌఖ్యం, వైరులు.
పుష్యమి :—వస్త్ర, విద్య, బంధు, మిత్ర, ధనలాభములు, కళత్ర అనారోగ్యం.
ఆశ్లేష :—విచారం, చిత్తచలనం, కుటుంబ సౌఖ్యం, నూతన కార్యసిద్ధి, వైరులు.
మఖ :—సత్కార్యాచరణ, ధనలాభం, చిత్తస్థైర్యం, ప్రయాణం, బంధుమిత్ర సమాగమం.
పుబ్బ :—ధనలాభం, మంచివిద్య, బంధువులవలన ధనహాని, వైరులు, చిత్తచలనం.
ఉత్తర :—ప్రయాణం, ధనవ్యయం, కళత్ర అనారోగ్యం, మిత్రసమాగమం.
హస్త :—సౌఖ్యం; అనవసరఖర్చు, తన్మూలకచింత, యత్న కార్యాలస్యము.
చిత్త :—శరీరతాపం, కళత్రఅనారోగ్యం, ధనలాభం, యత్న కార్యానుకూలత.
స్వాతి :—కోపం, కించిదనారోగ్యం, చిత్తచలనం, సంతాన లాభం.
విశాఖ :—మంచివిద్య, సోదరకలహం, భూవిక్రయం, ధనవ్యయం, కార్యాలస్యము.
అనూరాధ :—వస్త్రలాభం, కించిదనారోగ్యం, కళత్ర అనారోగ్యం, మిత్రసమాగమం, ధనవ్యయము.
జ్యేష్ఠ :—విచారం, మనస్తాపం, అసౌఖ్యం, కుటుంబ అనారోగ్యం, మంచివిద్య.
మూల :—సత్కార్యాచరణ, ధన, బంధు, మిత్ర లాభములు, వైరులు, యత్న కార్యసిద్ధి.
పూర్వాషాఢ :—ధనలాభ వ్యయములు, సంతోషం, సోదరకలహం, వైరులు.
ఉత్తరాషాఢ :—ప్రయాణం, వైరులు, అనవసరధనవ్యయం, కించిదనారోగ్యం.
శ్రవణం :—సౌఖ్యం, ధనలాభం, భూలాభం, కళత్ర అనారోగ్యం, చిత్తచలనం.
ధనిష్ఠ :—శరీరతాపం, మంచివిద్య, సంతాన అనారోగ్యం, వైరులు, కార్యాలస్యం.
శతభిషం :—కోపం, మనస్తాపం, ప్రయాణం, ధనవ్యయం, కించిదనారోగ్యం.
పూర్వాభాద్ర:—బంధు మిత్ర సమాగమం, విద్య, ధనలాభములు, వైరులు.
ఉత్తరాభాద్ర:—వస్త్రలాభము, యత్న కార్యాలస్యం, కుటుంబసౌఖ్యం, వైరులు.
రేవతి :—విచారం, సోదరకలహం, కుటుంబసౌఖ్యం, యత్న కార్యాలస్యం, వైరులు.

ఉచితము :—మీ యిష్టమువచ్చిన మూడు ప్రశ్నలు వ్రాసి, జాతకముగాని, జననకాలముగాని, నక్షత్రముగాని ప్రశ్నలువ్రాయు కాలముగాని, వ్రాయుచు పోష్టుచార్జినిమిత్తము 0—2—0 స్టాంపులు పంపిన ఉచితముగా సమాధానములు వ్రాయబడును.

బులుసు సూర్యప్రకాశశాస్త్రి, కొత్తపేట – తెనాలి,

# శివలింగ ప్రసాద నిర్మాల్య సిద్ధాంతము

"విద్యానిధి"

ఆస్తికులైన భారతీయులు అనాది కాలము నుండి విగ్రహాత్మకములైన దేవతామూర్తులను పూజించుచు వాని ప్రసాదమును స్వీకరించుచున్న సంగతి లోకవిదితముగా నున్నది. అటులే కాశీరామేశ్వర శ్రీశైలాది మహాక్షేత్రములలో గల శివలింగముల ప్రసాదమును, తీర్థమును, పత్రపుష్పాది నిర్మాల్యములను మిక్కిలి భక్తితో బడసి ధన్యులగుచున్నట్లు సుప్రసిద్ధము. ఐనను కొందరు అజ్ఞానముచేతను, ధూర్తతచేతను శివప్రసాదమును గూర్చి అశాస్త్రీయములైన విషయములను పామరులకు బోధించుచు భ్రమలో బడవేయుచున్నారు. ఇందులో ఒక పద్ధతి కనుపించుట లేదు. ఎవరినాలుక ఎట్లు పలికిన అట్లుగా ఆ యా యూరిలో చెల్లుబడి యగుచున్నది. "లింగము నెదుట బెట్టిన నారికేళ కదళీ ఫలాదులను గ్రహింపవచ్చును గాని, నైవేద్యము (అన్నము, పాయసము) వగైరాలను భుజింపగూడదు" అని ఒకఁడనును. మరియొకడు "శివార్చకులును, నిత్యపూజారులును స్వీకరింపవచ్చును, గాని ఇతరులకు పనికిరాదు గోవులకు బెట్టవచ్చును" అని ఘోషించును. ఇంకొక మహనీయుడు "కేవల శివలింగప్రసాదము పనికిరాదుగాని ఆ గుడిలో పార్వతి వగైరా విగ్రహము లున్నచో పనికివచ్చును" అని నిర్ణయించును. ఇది శివుని ప్రసాదమును గూర్చియె కాదు, విష్ణుప్రసాదమును గూర్చియును కొంతవివాదము గలదు. యామునాచార్య, రామానుజాచార్య, తెంగలి, వడఘలి సంప్రదాయములు భిన్నముగా నున్నవి. అనుకూలత గల చోటనే తప్ప అది భగవత్ప్రసాదమైనను తమ సంప్రదాయములేనిచోట వైష్ణవులును స్వీకరింపరు. చతుర్థజాతులు అర్చకులుగా నున్న దేవాలయములలో ఎట్టి దేవుని ప్రసాదమునైనను అగ్రజాతులు గ్రహింపరు. ఇటులే తీర్థ ప్రసాద విషయమున ననేక ఆచారములును పద్ధతులును, తారతమ్యములును గలవు ఐనను శివప్రసాద విషయమును సరిగ దెలిసికొనక పెద్దపెద్ద యపోహలను లేవదీయుచు కొన్ని గ్రామములలో దుర్వాదములనుగూడ సాగించుచున్నారు. కావున శాస్త్రీయమైన చర్చను కొంతవరకు సంక్షేపముగ నిట వివరింప దలచినాను.

"శివనైవేద్య దర్శనము గొన్నను పాపములు దూరము తొలగును. ఇక భక్షింపగా కోట్ల పుణ్యములు లభించును. యాగాదుల జేయుటకన్న శివప్రసాదమును భక్షించిన శివసాయుజ్య మబ్బును. లభించిన శివనైవేద్యమును శిరసా స్వీకరించి శివధ్యానముతో భక్షింపవలెను. శివప్రసాదమును గ్రహింపగూడ దని యెవనికి దుర్బుద్ధి కలుగునో వాడు మహానరకము నందును. శివదీక్షితుడైన భక్తుడైన భక్తుడు సర్వలింగముల ప్రసాదమును గ్రహింపవలెను. దీనికి మహాప్రసాదమని పేరు"—

దృష్ట్వాపి శివనైవేద్యం యాంతి పాపాని దూరతః । భుక్తేతు శివనైవేద్యే పుణ్యా న్యాయాంతి కోటిశః ॥౪॥ అలం యాగసహస్రేణ హ్యలం యాగార్బుదైరపి । భక్షితే శివ నైవేద్యే శివసాయుజ్య మాప్నుయాత్ ॥౫॥ ఆగతం శివనైవేద్యం గృహీత్వా శిరసా ముదా । భక్షణీయం ప్రయత్నేన శివస్మరణ పూర్వకం ॥౭॥ న యస్య శివనైవేద్య గ్రహ ణేచ్ఛా ప్రజాయతే । స పాపిష్ఠో గరిష్ఠః స్యా న్నరకం యాత్యపి ధ్రువం ॥౯॥ శివదీక్షా న్వితో భక్తో మహాప్రసాదసంజ్ఞకం।సర్వేషా మపిలింగానాంనైవేద్యంభక్షయేచ్ఛుభం॥౧౧॥ (శివపురాణ - విద్యేశ్వర సంహిత. అ. ౨౨)

దీనిని బట్టి శివలింగ ప్రసాద మహిమ యెట్టిదో పాఠకులకును స్పష్టముగ దెలియ గలదు. ఇందు చివర శ్లోకమునగల శివదీక్షితు నకు సమస్త లింగముల ప్రసాదముగ్రహించు అధికారముగలదు. శివదీక్ష యనగా శివా గమ శాస్త్రము నెరిగి శివాచారము గలిగి పరంపరగా శివాచార్యుల వంశమున మఠస్థ లమునందు జన్మించిన గురునివలన అనుగ్రహ పూర్వకముగ నొసంగబడు సంస్కారమని యెరుంగునది. శివదీక్షితు డనగా పైగురువు వలన శివమంత్రోపదేశము నొంది భూతి రుద్రాక్షల ధరించువాడు, శివభక్తుడు అని యర్థము. ఇక్కడ శైవుడు శివదీక్షితుడు అనగా సామాన్య శైవుడనియే అర్థముచేయ వలెను గాని వీరశైవుడని అర్థముచేయరాదు. వీరశైవుల విషయము ముస్ముందు నిరూపింప బడును. ఈ చర్చవలన శివదీక్షితులకు దప్ప సర్వసాధారణజనమునకు సమస్త లింగ ప్రసా దముల భుజించు అధికారము లేదని స్పష్టమై నది. మరి అదీక్షితులగతి యెట్లనగా ప్రమా ణము జూడుడు.

“శివదీక్ష పొందకున్నను శివభక్తి గల వారికి శివనైవేద్య భక్షణవిషయమున నిర్ణయ మేమనగా:—నర్మదా శాలగ్రామాదులలో బుట్టిన లింగములు, పాదరసలింగములు, బం గారులింగములు, రజత లింగములు, సురలు, సిద్ధులు ప్రతిష్ఠించిన లింగములు, శ్రీశైలాది శిలలతో నిర్మించినలింగములు, కాశ్మీర లింగ ములు, స్ఫటికరత్న లింగములు, ద్వాదశ జ్యోతిర్లింగములు (సౌరాష్ట్ర సోమనాథ, శ్రీశైల మల్లికార్జున, ఉజ్జయినీ మహాకాల, అమరేశ్వర-ఓంకారేశ్వర, కేదారేశ్వర, డాకినీ భీమశంకర, కాశీ విశ్వేశ్వర, నాసిక త్ర్యంబ కేశ్వర, పరళీవైద్యనాథ, దారుకావన నాగే శ్వర, సేతుబంధరామేశ్వర, శివాలయ ఘృష్ణే శ్వర, ఇవి ౧౨ జ్యోతిర్లింగములు) మున్నగు మహాలింగముల నైవేద్యము భక్షింపుచో చాంద్రాయణసమమై పావనమైనది. బ్రహ్మ ఘ్నునైనను శివనిర్మాల్యమును ధరించి శివ ప్రసాదమును స్వీకరించుచో శుచియై ముక్తు డగును”

అన్యదీక్షాయుతనృణాం శివభక్తి రతా త్మనాం । శృణుధ్వం నిర్ణయం ప్రీత్యా శివ నైవేద్య భక్షణే ॥౧౨॥ శాలగ్రామోద్భవే లింగే రసలింగే తథాద్విజాః । పాషాణే రాజితే స్వర్ణే, సురసిద్ధప్రతిష్ఠితే ॥౧౩॥ కాశ్మీరే స్ఫాటికే రాత్నే జ్యోతిర్లింగేషు సర్వశః । చాంద్రా యణసమం ప్రోక్తం శంభోర్నైవేద్య భక్షణం ॥౧౪॥ బ్రహ్మహాపి శుచిర్భూత్వా నిర్మాల్యం యస్తు ధారయేత్ । భక్షయిత్వాద్రుతం తస్య సర్వపాపం ప్రణశ్యతి ॥౧౫॥

(విద్యేశ్వరసంహిత-అధ్యాయ ౨౨)

దీనివలన సర్వసామాన్యులకు పార్థివలింగములు, ఋషులు స్థాపించిన లింగములు మున్నగు కొన్నిలింగముల ప్రసాదము తప్ప మహాలింగములయొక్కయు శాస్త్రీయముగ స్థాపించిన లింగములయొక్కయు ప్రసాదము గ్రహణయోగ్యమని ఘంటాఘోషముగ దెలిసది. పుణ్యాత్ములకే యిట్టి మహాప్రసాదము లభించుగాక! పాపులు దూరముగ నుండుట సహజము. సురప్రతిష్ఠితములు; ఇంద్రేశ్వర, హరీశ్వర, బ్రహ్మేశ్వరాదులు సిద్ధ ప్రతిష్ఠితములు:— అగస్త్యేశ్వర, శుక్రేశ్వర, వసిష్ఠేశ్వర, రామేశ్వరాదులు ఇంకను స్వయంభూలింగములు, తత్త్వలింగములు, అష్టోత్తర లింగములు, ఆచార్యోద్భవ లింగములు, సుప్రసిద్ధలింగములు అని లోకమున గల లింగములన్నియు పుణ్యజనకములని తెలియవలెను. ఇట్టివి కొన్ని ఆ యా స్థలపురాణములలోను మహాపురాణోప పురాణములలోను ప్రతిపాదితములై యున్నవి. నైవేద్యమేకాదు శివలింగాభిషేచన జలమును మూడుమారులు స్వీకరించిన సర్వపాపహర మనియును దానిని శిరమునదాల్చిన యోగశాస్త్రమందలి జాలంధరబంధనమాన పుణ్య మనియును ప్రమాణములు కలవు.

స్నాపయిత్వా విధానేన యో లింగస్నాపనోదకం । త్రిఃపిబేత్త్రివిధం పాపం తస్యేహాశు వినశ్యతి ॥౧౮॥ (విద్యేశ్వర-అ. ౨౨)

జలస్యధారణం మూర్ధ్ని విశ్వేశ స్నానజన్మనః । ఏమజాల్లంధరోబంధ స్సమస్త నుర దుర్లభః ॥౧౮౦॥ (స్కాంద. కాశీఖండ. అ.౪౧)

ఇక శివనిర్మాల్యము భక్షణ చేయరాదను వాదమును విమర్శింతము. కమలాకర భట్టు, వాచస్పతిమిశ్రుడు, మాధవాచార్యుడు మున్నగు ధర్మశాస్త్ర వ్యాఖ్యా కర్తల గ్రంథములు సామాన్యుల కర్థముగాక, ప్రకరణములు దెలియక లోకమునకు పెడర్థములు జెప్పు అర్ధపండితులు మిక్కిలి పెరిగినందువలన సరియైన విధులు మరుగు పడి యున్నవి. సామాన్య వాక్య విశేష వాక్యములను ఉపసంహారముతో ఏకీభవింపజేసి సిద్ధాంతమును తేల్చుటను మీమాంసాశాస్త్రపద్ధతి యందురు. కేవలము సంస్కృతభాష కొంత తెలియగనే ధర్మశాస్త్రములకర్థము చెప్పనెంచుట పరిహాసాస్పదమని పండితతల్లజు లెరుంగనిది కాదు. తంత్రవార్తిక, శ్లోకవార్తిక, శాబరభాష్య, మీమాంసా న్యాయమాలాది గ్రంథముల చర్చాపద్ధతియే ఇట ఆశ్రయణీయము. ఏ నిర్ణయ సింధు, ధర్మసింధువులనో చూచి ఆభాసములను పట్టుక ప్రాకులాడెడి వారికి సిద్ధాంతసాధము నధిరోహింపరాదనుట ముమ్మాటికి సత్యము. పై విద్యేశ్వర సంహిత ౨౨ అధ్యాయముననే సామాన్యులకు భ్రమగల్గు సామగ్రికలదు. "ఎక్కడ చండాధికారము కలదో దానిని నరులు భుజింపరాదు. చండాధికారము లేనిచోట భక్తితో భుజింపదగును".

చండాధికారో యత్రాస్తి తద్భోక్తవ్యం న మానవైః । చండాధికారో నో యత్ర భోక్తవ్యం తచ్చభక్తితః ॥౧౯॥ అగ్రాహ్యం శివనైవేద్యం పత్రపుష్పం । శాలగ్రామ శిలా సంగాత్ సర్వం యాతి పవిత్రతాం ॥౧౯॥

"శివనైవేద్యము, పత్రపుష్పములు గ్రహింపవలదు. అది శాలగ్రామశిల తగిలిన శుద్ధమగును" అనియును "భూహిరణ్య రజత

